1984 సెప్టెంబర్
155

# సృజన

## ప్రజాస్వామ్యం

ఎంత కష్టమో
ప్రజాస్వామ్యం నిలబెట్టివుంచడం
అడగండి, చెబుతారు వాళ్ళు:
ఓ దూర దృష్టిగల జాతిపిత
ఈ దేశంలో నెల కొల్పించాడు
ప్రజా స్వామ్యాన్ని
తెలివిగల తన కొడుకుచేత;
అతను బతికి వున్నన్నాళ్ళూ
తెగ తిప్పేశాడు
అరచేతిలో బొంగరంలా
ప్రజాస్వామ్యాన్ని
పోతూ పోతూ దాన్నికాస్తా
కూతురు చేతికి అందించి పోయాడు.
మందు గుండు పాతర్ల ఘాటువాసన
గాలిలో తేలుతున్నపుడు
నొసట పడే ముడతల్లో
రానున్న ప్రమాదం పొడ సూపినపుడు
ఆ చెయ్యి
మాటి మాటికీ

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

155 మాసపత్రిక సెప్టెంబర్ 1984



కవర్ పేజి : కంచన్ కుమార్ హిందీ కవితకు నిర్మలానంద చేసిన అనువాదం నుంచి


| | | |
|---|---|---|
| నిర్వహణ<br>సాహితీ మిత్రులు | సృజన<br>హనుమకొండ 506 001. | ఈ సంచిక రు. 2<br>సంవత్సరచందా రు. 20 |

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002

సెప్టెంబర్ 9 మావో వర్ధంతి:

# ప్రపంచ విప్లవనేత కామ్రేడ్ మావోకు విప్లవ జోహార్లు

(కామ్రేడ్ మావో మరణించినపుడు విశాఖ జైల్లో ఖైదీగావున్న కామ్రేడ్ రసాగర్ రాసుకున్న డైరీలోంచి....)

20–9–76

రెండురోజుల క్రితం ఎనభైకోట్ల మంది చైనా ప్రజలు తుది నివాళులర్పించారు చైర్మన్ మావోకు.

స్వర్గశాంతికి ప్రతీక అయిన తీన్‌మేన్ కూడలిముందు పదిలక్షల మంది ప్రజలు బారులు తీరినిల్చొని చైర్మన్ మావోకు శ్రద్ధాంజలి ఘటించారు. సభానంతరం లక్షలాది మంది ప్రజలు తమనాయకుని వియోగ వ్యధను భరించలేక విలపించారు. ఈ "విలాపధ్వని" కిలోమీటరు దూరంవరకు వినవచ్చిందట.

మావోమార్గాన్ని అనుసరించవలసిందిగా ప్రధాని ఉద్బోధించారు.

చైనా ప్రజలు చైర్మన్ మావోకు హుందాగా, నిరాడంబరంగా, హృదయాలను కదిలించే రీతిలో వీడ్కోలు చెప్పారు.

ఒక విదేశీ విలేఖరి ఇలా వ్రాస్తున్నాడు.

"అవి తీవ్రమైన ఉద్రిక్త క్షణాలు. నేను పరాయిదేశస్థుడనని నాకనిపించలేదు. సజల నయనాలలో ఆ ప్రజల విషాదాన్ని నేనూ పంచుకున్నాను."

21-9-76

చైర్మన్ మావో నూతన మానవుణ్ణి సృష్టించేందుకు విఫల ప్రయత్నం చేశాడని ఒక అర్ధవలస, అర్ధభూస్వామ్య వ్యవస్థకు చెందిన బుద్ధిజీవి వ్యాఖ్యానించారు.

గౌతమబుద్ధుడు, జీసస్, మహమ్మదు విఫలం పొందిన ప్రయత్నంలో మావో విజయం పొందటం అసంభవమని తీర్పుచెప్పాడు. (ఎందుకనో ఈ సందర్భంలో ఎప్పటిలాగ గాంధీపేరు వారితో జత చేయలేదు.)

మానవునిలో స్వార్థం అంతర్భాగమనీ, మానవుడు సమిష్టిశ్రేయస్సు కోరడనీ, నూతన మానవుడు నూతన సమాజాన్ని (కమ్యూనిజాన్ని) నెలకొల్పడం పగటికలని కొక్కిరించాడు.

ఇది ఈ తరహా బుద్ధిజీవులకు మానవుని భవిష్యత్తు పై ఉన్న విశ్వాసం. మరో వైపు విప్లవయోధులు, విప్లవమేధావులు ఉరికంబం మీద నిలబడి కూడా నూతన మానవుణ్ణి, నూతన యుగాన్ని ఆహ్వానిస్తున్నారు.

మృత్యుముఖాన నిలిచి
జీవనగీతిక పాడుతున్నారు
నవజీవన గీతిక పాడుతున్నారు

23–9–76

నవచైనా నిర్మాత, ప్రపంచ విప్లవనేత కామ్రేడ్ మావో అస్తమించారు. విప్లవకారులమైన మేము కామ్రేడ్ మావోకు విప్లవ జోహార్లు అర్పిస్తున్నాం.

కామ్రేడ్ మావో ప్రపంచ విప్లవకారులకు - వారిలో భాగమైన భారత విప్లవ కారులకు - మహోపాధ్యాయుడు, ఆప్తమిత్రుడు.

అతడు ప్రపంచపీడిత జనావళి ఆశాజ్యోతి.

"తుపాకిగొట్టం ద్వారానే రాజ్యాధికారం సిద్ధిస్తుంద"ని ఆయన శ్రామికవర్గానికి ఉపదేశించారు.

"ప్రజాసైన్యం లేకుండా ప్రజలకుండేదేమీలేద"ని ఆయన ఉద్బోధించారు.

"విప్లవం కావాలంటే విప్లవపార్టీ ఉండితీరాల"ని నొక్కిచెప్పారు. విప్లవ ఐక్య సంఘటన ప్రాముఖ్యతను వివరించారు.

రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకునేందుకు ప్రజాయుద్ధ పంథాను రూపొందించారు. స్వాధీనం చేసుకున్న రాజ్యాధికారం తిరిగి పరాన్న భుక్కుల పరంకాకుండా వుండేందుకు శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవ వ్యూహాన్ని రచించారు. ఆ విప్లవానికి నాయకత్వం వహించారు.

కమ్యూనిస్టు వ్యవస్థను సృష్టించే నూతన మానవుణ్ణి సృష్టించేందుకు అవసరమైన సిద్ధాంతాన్ని, ఆచరణను ఆయన రూపకల్పన చేశారు.

"వర్గపోరాటాన్ని మరచిపోవద్ద"ని సదా హెచ్చరించారు.

"స్వార్థాన్ని ఓడించడం ద్వారానే రివిజనిజాన్ని ఓడించగలమ"ని వివరించారు.

"సాహిత్యం, కళలు ప్రజలకు ఎలా సేవచేయాలో" విడమర్చి చెప్పారు

గతితార్కిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథాన్ని మరింత సుసంపన్నం చేశారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌ల బహుముఖ కృషిని ముందుకు తీసుకపోయారు.

కామ్రేడ్ మావో విప్లవ పోరాటయోధుడు, కార్మికవర్గ రాజకీయవేత్త. తత్వవేత్త. విప్లవసాహిత్యం, సంస్కృతులకు వొరవడి దిద్దిన కళాశాలి, మహామనీషి. విప్లవ ప్రవక్త.

కామ్రేడ్ మావో భారత విప్లవోద్యమ విజయాన్ని మనసాకాంక్షించారు. భారతదేశ రాజకీయ ఆకాశంలో వినిపించిన వసంతకాల మేఘగర్జనలో ఆయన వున్నారు. నక్సల్‌బరీ రైతాంగ సాయుధ పోరాటంలో వున్నారు. శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటంలో వున్నారు.

ఒక్కమాటలో: భారతజనతా ప్రజాతంత్ర విప్లవంలో ఆయనవున్నారు.

"అతడు మా దూరదృష్టి
అతడే మా సూక్ష్మదృష్టి
అతడు మా చుక్కాని
పెనుతుఫాన్‌లో లైట్ హౌస్"

కామ్రేడ్ మావో భౌతికంగా అస్తమించినా, మావో ఆలోచనా విధానం జ్యాజ్వల్య మానంగా ప్రకాశిస్తోంది.

కామ్రేడ్ మావో కనుమూసినా, జనచైనా, శ్రామికవర్గవిప్లవ పంథాలోనే పురోగమిస్తుంది.

కామ్రేడ్ మావో తనువు చాలించినా, ప్రపంచ విప్లవోద్యమం, అందులో భాగమైన భారత విప్లవోద్యమం, మావో ఆలోచనా విధానం వెలుగులో తుదివిజయం సాధించి తీరుతుంది. కా॥ మావో రగిలించిన తూర్పుపవనం నిలుస్తుంది.

కామ్రేడ్ మావో మరణం మాలో కలిగించిన అపారశోకాన్ని విప్లవ దీక్షగా మలచుకుంటాం.

మేము కా॥ మావో సృష్టించిన శ్రామికవర్గ విప్లవ వారసులం.

"We are a Special mould"

భారతజనతా ప్రజాతంత్ర విప్లవాన్ని జయప్రదం చేసేందుకు విప్లవకారుల మైన మేము తిరిగి శపథం చేస్తున్నాం.

# ఫోటో

నవజీవన్

జీవితం నశ్వరం
ఫోటో శాశ్వతం
అని స్టూడియో చిన్నయసూరులు
ఇంగ్లీషులో బోర్డులు కట్టినప్పటినుంచీ
నాకు ఫోటో దిగాలని ఎంతో కోరిక.

ఏవేళ ఏమయి పోతానో
కౌమారంలో మీసంకింది దరహాసాన్నీ
యవ్వనంలో కళ్ళలో భవిష్యదాశనూ
సజీవ చిత్రిక పట్టి-
నామీద నాకు చాలా ప్రేమకదా
చూసుకుందామని!

అద్దంలో ఉన్న మొహమే కనిపిస్తుంది
ఫోటోలో ఉండాల్సిన మొహం చూసుకుందామని!

2

నేను విద్యార్థుల స్నేహం పట్టినప్పట్నించీ
యువకుల సాహచర్యంలో తిరుగుతున్నప్పట్నించీ
మనుషుల్ని ప్రేమిస్తున్నప్పటి నుంచీ
నా ఫోటోమీద పోలీసులకు ప్రేమ పుట్టుకొచ్చింది

నేనెప్పుడూ వినలేదు
నేరస్తుల స్థానంలో నిర్భయస్తుల ఫోటోలుంటాయని
రక్త బంధువులు, స్నేహితులు, ప్రేమికులు
జ్ఞాపకంగా, తియ్యగా, ఉద్విగ్నంగా
దాచుకునే ఫోటోలు
పోలీసులకు కావాలంటే

పోజిచ్చే మంచి మూడ్‌లో
మనసుకలకుక్కమన్నట్లు.

## 3

చిరునవ్వు వెన్నెలలు చిందినచోట
దాహమంటే వాడు మూత్రం పోసాడు
చిగురించే యవ్వనాన్ని
పిగిరెట్లతో కాల్చాడు
ఫోటోకాదు లాకప్‌లోమేకులు
మండుతున్న నెత్తురును వేళ్ళాడదీసాడు
సూర్యుణ్ణి డార్క్‌రూంలో కడుగుతున్నాడు
రశ్మిరహస్యం కక్కమని అడుగుతున్నాడు

## 4

వాడు లాకప్‌లో మీసాలు పీకేసాడు
ఆ ఫోటో తీసెయ్
వాడుకళ్ళలో యాసిడ్ పోసాడు
ఆ ఫోటో తీసెయ్
వాడు నా సజీవ చిత్రపటాన్ని పట్టుకొని
గాలిస్తున్నాడు. హృదయంలో దాచెయ్
ఆ మునివేళ్ళతో తాకే ఫోటోను
ఆ చేతులతోనే చింపు
ఆ దీపం వెలుగుకి దగ్గరకు తెచ్చుకొని
చూసే ఆ ఫోటోను
కళ్ళు మూసుకున్న చీకట్లో
ఆ దీపం పై ఉంచు

గతం మోసుకొచ్చే జ్ఞాపకాల సమీరంలో
ఫోటో కాలుతున్న కమురువాసన

అది ఇనుప బూట్ల డెక్కలవాసన
ఖాకీ ఖడక్ ఇస్త్రీవాసన

5

నాకుఫోటోమీద కోరికపోయింది
ఫోటో నిలిచి వుంటుంది
నాకు నిలకడమీద గురిపోయింది
జీవిస్తూ చలిస్తూ మారుతూ
మరణించీ మార్పుకు గురుతవుతూ
ప్రవహించాలని వుంది

జ్ఞాపకం ఏమీ మిగలదా
దీపంలో చూడు
చిహ్నం ఏమీ మిగలదా
చైతన్యంలో చూడు
కళ్ళను మనసులోకి తెచ్చుకుంటే
నీళ్ళలో అలల అలజడి ఉద్యమాన్ని చూడు

6

అభిరుచి పట్టిచ్చే బలహీనతై
స్నేహం రేడ్ జరిగే నిఘా అయి
ప్రేమ ప్రమాదాన్ని శంకించి
ప్రజా చైతన్యం ఎవడో రెచ్చగొడితే
భగ్గుమంటుందనుకునే వ్యవస్థ ఇది
విలువలు తలకిందులైన సమాజం ఇది

ఇక్కడ
స్టూడియోలోని నెగిటివ్‌లనుకూడ
ధ్వంసంచెయ్ :

రెండు పాలస్తీనా కవితలు :

## యూదు మిత్రునికి

ఫౌజీ అల్ అస్మర్

అసాధ్యాలు సాధించమని
అడగకు నన్ను
నక్షత్రాలను వేటాడమనీ
సూర్యుని దగ్గరికి నడచిపొమ్మనీ
అడగకు నన్ను
సముద్రాలు పుక్కిట పట్టమనీ
ఉదయకాంతి మలిపేయమనీ
అడగకు నన్ను
నేను మనిషిని, అంతే.
నాకళ్ళు, నాప్రేమ,
నా చిన్ననాటి జ్ఞాపకాలు
వదులుకొమ్మని అడగకు నన్ను
నా బాల్యం
ఓ ఆలివ్ చెట్టుకింద గడచింది
నా తోటలో పళ్ళుతిన్నాను నేను
విస్తారమైన ద్రాక్షతోటల్లో
సారా తాగాను
లోయల్లో
కాక్టస్ పళ్ళు రుచిచూశాను
ఇంకా.... ఇంకా.... ఎన్నో....
కోకిల నా చెవుల్లో పాటలు పాడింది
పొలాల నగరాల స్వేచ్ఛాపవనాలు
నన్నన్నివేళలా చక్కిలిగింతలు పెట్టాయి
నేస్తం- నువు నన్ను
నాదేశం వదిలిపొమ్మని
ఆజ్ఞాపించలేవు.

(మార్చి 1971)

## ఓ మనిషి గురించి

మహమూద్ దార్విష్

వాళ్ళు ఆయన నోటికి సంకెళ్ళేశారు
ఆయనను వధ్యశిలకు కట్టేశారు
ఆయనను హంతకుడన్నారు
ఆయన తిండినీ గుడ్డల్నీ
జెండాల్నీ వాళ్ళెత్తుకుపోయారు
ఆయనను మృత్యుగహ్వరంలోకి నెట్టేశారు
ఆయనను వాళ్ళు దొంగ అన్నారు
ఆయనను అన్ని రేవుల్నించీ నెట్టేసి
ఆయన నెచ్చెలిని లాక్కొని
వాళ్ళాయనను శరణార్థి అన్నారు
మంటలు మండే మీకళ్ళకూ
నెత్తురంటిన చేతులకూ చెప్పుకోండి
రాత్రి ముగిసి పోతుంది
ఏ జైలూ ఏ సంకెలా మిగలవు
నీరో చచ్చాడుగాని
రోమ్ చావలేదు
రోమ్ తన చూపులతో పోరాడింది
ఎండిపోతున్న గోధుమకంకిలో విత్తనాలే
మైదానాన్ని లక్షల పచ్చని కంకులతో నింపుతాయి.

# సమూహంలోకి

'ప్రవాసి'

మన కాలపు కవికి ఏకాంతమూ సమూహమూ రెండూ ప్రాథమిక విధులుగానే ఉన్నాయి —పాబ్లో నెరూడా

నేనిక్కడ ప్రవాసిని
ఇక్కడ
ఆనంద విషాదాల జ్ఞాపకాల
వెలుగునీడల్ని పట్టుకోవడానికి
నా చూపుల్ని
ఆకాశంలోకి విసురుతాను
నా ఆకాశమంతా నా కిటికీయే
నా కలలకు తలఊపే ఓ కొబ్బరిచెట్టూ
అప్పుడప్పుడు నన్ను పలకరించే
ఓ మబ్బు తునకా
నా ప్రకృతి
నా కిటికీయే నా దిగంతం

కళ్ళుమూస్తే
కనుపాపల కనుచూపుమేరలమీద
రెప్పల తెరలమీద
ఎన్నెన్ని ప్రేమాస్పద దృశ్యాలు....!
కళ్ళు తెరిస్తే
చూపులంత మయ్యేచోట
నల్లమక్కల తెల్లకాగితాలమీద
జ్ఞానమంతా అలుక్కుపోయి
మమకారం అలలుగా వీస్తుంది
హోరెత్తుతుంది

సింహద్వారం గలగలమని
నాదాకా ప్రవహించుకొచ్చే...
నన్ను ముంచెత్తే
అడుగుల చప్పుడుకోసం
మనిషి మనిషినంతా
వాకిలి అయి పరుచుకుంటాను
చల్లని కరస్పర్శను మోసుకొచ్చే
సాయంకాలం కోసం
చీకట్లు ముసురుకునే నా మెదడును
వెలిగించి పోయే
అర్ధరాత్రి తలుపు చప్పుడు కోసం
ఏరోజూ నాగదికి చేరని
పోస్ట్‌మాన్ కోసం
కలల్లో పరుగెత్తుకొచ్చే
మిత్రుల కోసం
సాన్నిహిత్యాల కోసం
రోజులో కొద్దిక్షణాలకోసం
రోజంతా నేను బతుకుతాను

2

ప్రవాసంలో కృపస్కయా స్మృతులు
నేనొంటరిని కానని వెన్నుతడతాయి
లెనిన్ ప్యారిస్ ప్రవాసక్షణాలు
నాకంటిపాపలమీద కదళ్లాడీ
నన్ను ముద్దాడతాయి

చెంపలమీద జాలువారే ఏకాంతాన్ని
అలవోకగా తుడిచేస్తాయి

ఇక్కడ
నా గదే నా సమస్తలోకమైనచోట
సమస్తలోకమూ నా గదిలాగ
నా వేళ్ళకొసల కదలాడుతుంది
ప్రపంచం నానుంచి
జానెడు అవతల నిలబడి
అతిస్పష్టంగా కనబడుతుంది
నేను నివసిస్తున్న
ఈ చిటారుకొమ్మనుంచి
అడవి అడవంతా
నా రెప్పల నీడల్లో రగుల్కొంటుంది

ఇక్కడ
ప్రపంచం మొదలవుతున్నచోట
ఇక్కడ
ప్రపంచం వేగవంతం కావడానికి
బత్తీ ముట్టిస్తున్న చోట
సెలయేటి గలగలలన్నీ నావే
భూప్రకంపనాలన్నీ
నేనే పట్టుకుంటాను
రెపరెపలాడే ఆకులపతాకాలు
అగ్ని పర్వతాల ఉజ్వలత్యాగాలు
మానవమేధో సంక్షోభాలు
భవనాల చిక్కుదార్ల
భూగర్భాల్లో సంచలనాలు

సముద్రపు లోలోతుల్లో
ప్రవహిస్తున్న అగ్నిశిఖలు
పల్లెసీమల
తరతరాల ఊడలమర్రినేలకూలి
నవనవలాడుతూ
మారాకు వేస్తున్న ఎర్రజెండాలు
విత్తనం పగిలి
చిగురు స్వేచ్ఛలోకి
ఎదుగుతున్న చప్పుడు
వందపూలై వికసించడానికి
ఒక మొగ్గ లిప్తలో వెయ్యేవంతులో
భవిష్యత్తులోకి గెంతుతున్న సంరంభం
ఆలోచనల అలలమీద
క్షితిజం నుంచి ప్రతిఫలించే
అరుణ తార
అన్నీనేనే పట్టుకుంటాను
ప్రవాసినే ఐనా
ప్రజా జీవితంతో
అనితర సాధ్యమైన సహవాసం చేసే
మనిషిని నేను
రాగద్వేషాలు చంపుకున్న
మరమనిషిని కాను—
మమకారాన్ని
దిగంతాల దాకా విస్తరించుకున్న
మానవుణ్ని నేను
ద్వేషాన్ని ధ్వంసించడానికి
ద్వేషాన్నే ధరించిన
విశ్వమానవుణ్ని నేను

# అతను శవంకాలేదు, కొత్తశకం అయ్యాడు

—మానేపల్లి

ఎవరిదీ ఈ ముఖం ఇంత భయంకరంగా....
రక్తం చిమ్ముతున్న గంట్లతో
గిట్ట గరిచిన పళ్లతో, కోపంతో ఆగిపోయిన కళ్లతో
బిగుసుకున్న పిడికిళ్లతో....
ఎవరిదీ ఈ శవం ఇంత ఘోరంగా....
అడ్డంగా దారికి—

రహదారుల చిక్కులకూడలి నడుమ
చరిత్ర మలుపు తిరిగేచోట నుంచున్నాడు
జనం నడవవలసినదిశను రక్తంతో చూపించాడు

తెల్లగద్దలు — నక్షత్రాలజండా ఎగరేస్తూ
శాంతి గీతాలాలపిస్తూ రక్కిపోశాయి
గోధుమకంకులు పట్టుకుని ఎగిరిపోయాయి
తెల్లని ఎలుగుబంట్లు కరచాలనం చేస్తూ
కండలు ఎక్కదీశాయి
రుద్రాక్ష పిల్లులు ముసుగువేసుకునివచ్చి
వంటినిండా గంట్లుపెట్టి రక్తం పీల్చిపోయాయి
జాతీయమృగం పులి — పంజా విసిరింది
అతని ప్రాణం అతని శరీరాన్నివిడిచి
ప్రజల్లో కలిసిపోయింది

అతను శవం కాలేదు
కొత్త శకం అయ్యాడు
కోపంగా పైకి ఉబికిన కళ్లు
బిగిసిన ఆ పిడికిళ్లు
ఇవ్వవలసిన సందేశాన్నే ఇస్తున్నాయి

సూరత్ పాట :-

## తిరుగబడితె తప్పులేదు

జి. వి.

సూరతు పట్నమంట
సూడ ముచ్చటైనదంట
పెద్దపెద్ద మేడలంట
చిన్నచిన్న కారులంట
మేడలెనుక చూడబోతెరో
ఓ అన్నలారా!
మురికి గుడిసెలంట చూడరో
ఓ అన్నలారా! ॥సూ॥

పెద్దపెద్ద మిల్లులంట
[1] గావుఖాత లెవ్వోఃంట
వాటిలోన పడిసేది
పన్నె చిన్నెల బట్టలంట
సూరతు బట్టలు సూడ
ఎంతో ఖూబు సూరతంట
బట్టలోమొ పడిపెటోనికి
ఓ అన్నలారా!
కట్టగుడ్డ కరువసంటరో
ఓ అన్నలారా! ॥సూ॥

పాలిష్టర్ బట్టలంట
సిమీ, గజ్జి చీరలంట
నాయిలేను, జారిజెంటు
సుతిమెత్తని షిపానంట
కంటైపాప సంపుకోని
పోగుపోగు అతుకుబెట్టి
పంటిపిల్లల కంటెగూడరో
ఓ అన్నలారా!
పవరించుకుంట పడపరో
ఓ అన్నలారా! ॥సూ॥

అందమైన బట్టనదిపె
కార్మికుల బతుకు గూడ
మురికి కొంపలుండుడాయె
[2] బారగంట చేసుడాయె
గుడిసెల చుట్టు చూడరో
ఓ అన్నలారా!
దావాఖాన్ల జాతరాయెరో
ఓ అన్నలారా! ॥సూ॥

సూరతు బట్టలంట
సూరతైన బట్టలంట
దేశ, విదేశాలలోన
మంచి గిరాకున్నదంట
నాణ్యతకై తేనేమొ
సూరతే ముందున్నదంట
నాణ్యతెనుక చూడబోతెరో
ఓ అన్నలారా!
కార్మికుల నడుము విరిగెరో
ఓ అన్నలారా! ॥సూ॥

రంగులేమొ అద్దేటి
రంగుల కార్ఖాండ్లలోన
బ్రితుకుదెరువు లేకనేమొ
బారగంట చెయబడితె

బలిసిన లంజాకొడుకులు
కార్మికుల కడుపుకొట్టి
మేడమీద మేడకట్టిరీ
ఓ అన్నలారా!
బరువైన మిషంట్లు బెట్టిరి
ఓ అన్నలారా! ॥సూ॥

బరువుకేమో ఆగలేక
మేడలేమో కూలిపోయి
వందల మందినేమో
సజీవ సమాధిజేస్తే
అన్న తమ్ముడనకుంట
తమ్ముడన్న అనకుంట
అమ్మా అని అరుచుకుంట
ప్రాణాలే విడుసుసుంటే
చూడలేకనేమో జనం
బోరున ఏడుస్తుంటే
సీమకుట్టినట్టు లేదురో
ఈ సర్కారుకు
మేడకూలినట్టు కూలరా
ఈ సర్కారు ॥సూ॥

అందమైన సూరతంట
అడుగడుగున దోపిడంట
మేడలు మిద్దెలుగట్టె
కూలినాలి అన్నలాకు
కార్ఖాండ్ల పనిజేసే
కార్మికుల కైతెనేమో
పనికితగ్గ వేతనము
సర్కారు ఇప్పిస్తదంట

3 ఆర్ధగంట జెయ్యాల్నని
ఖానూన్లు జేసిరంట
ఖానూన్లు పేడబాయెరో
ఓ అన్నలారా!
లంచగొండి సర్కారాయెరో
ఓ అన్నలారా ॥సూ॥

కంట్రాక్టు పద్దతేమో
ఉండకూడ దంటారు
కార్మికులను పర్మినెంటు
చేసేస్తా మంటారు
లక్షలాది కార్మికులకు
కంట్రాక్టు పద్దతాయె
యజమానుల దోపిడాయె
కంట్రాక్టరు పీడనాయె
దోపిడీ భరియించలేక
యూనియాను కెల్దమంటె
యూనియను లీడర్లంతదో
ఓఅన్నలారా
యజమానుల చంచలైరిరో
ఓఅన్నలారా ॥సూ॥

అందమైన పట్నంలో
గుడిసెలుండ కూడదంట
ఫ్యాక్టరీల పనిచేసే
కూలినాలి జనాలంతా
పట్నానికి పదిమైళ్ళ
ఆవల నుండాల నంట
గుడిసె పీకేస్తరంట
మేడలేమో కడ్తరంట

మేడ లెవలపాలాయెరో
ఓఅన్నలారో
గుడిసెలె నీకు కరువాయెరో
ఓఅన్నలారా ॥సూ॥

హక్కులేమో చూడబోతె
అస్సలికే లేవాయె
హక్కురణలేదాయె
బోనాసు అంటె తెలువదాయె
పర్మినెంటు లేకపాయె
పర్వీసు నిండకపాయె
ఉన్న నెత్తురంత పీల్చిరో
ఓఅన్నలారా
మెడలుబట్టి గెంటు చుందిరి
ఓఅన్నలారా ॥సూ॥

ఒకటీకాదు రెండుకాదు
ఎన్నోతీర్ల దోపిడాయె
బారగంట చేపిసీవు
కంటిమీద కునుకురాక
బాధలన్ని మరిచిపోను
కంటిమీద కునుకురాను
యాష్ట మరిచిపోను నువ్వు
సార తాగడానికెళ్తె
[4]నిషాబంది అంటారు
పోలీసులు వస్తారు

సార అమ్ముతున్నవాని
కేసులెన్నో బెడతారు
ఉన్నోళ్ళు తాగుతారు
పారన్ విస్కీలంట
వాళ్ళనేమి అనలేని
ఉన్నోళ్ళ సర్కారు
కోర్టుల చుట్టుతిప్పిరీ
ఓఅన్నలారా
దండుగలునీకు వేసిరీ
ఓఅన్నలారా ॥సూ॥

ఇన్నితీర్ల దోపిడాయె
బతకడమే గగనమాయె
అందమైన పట్నంలో
అంధకార బతుకులాయె
సర్కారు తీరు చూడ
ఉన్నోళ్ళపట్టాయె
దోచుకునే దొరబాబులు
సర్కారు ఒక్కటైరి
ఈ దోపిడి మారాలంటె
నీ కష్టం తీరాలంటె
మనమంతా ఒక్కటై
కార్మిక సంఘాలుబెట్టి
తిరుగబడితె తప్పులేదురా
ఈ దోపిడీకి
లేకపోతె సుఖములేదురా
మనబ్రితుకాకు ॥సూ॥

---

వివరణ :— 1 చిన్న ఇండస్ట్రియల్ 2 పన్నెండుగంటలు 3 ఎనిమిదిగంటలు 4 గుజరాత్‌లో మత్తుపదార్థాలనిషేదం 6 మరియు 7 చరణాలకు ఉదహారణ శాంతినాధ పిల్కామిల్, కూలిపోవడం.

చర్చ:

# హేతువాద ఉద్యమం - ఒక పరిశీలన

పి. జె. వర్ధనరావు

మనరాష్ట్రంలో హేతువాద నాస్తిక భావాల ప్రచారం ఎంతోకాలంగా సాగుతున్నప్పటికీ డా॥ కోవూరు పర్యటన అనంతరం దీనికి ఒకవూపు వచ్చినట్లుగా గుర్తించవచ్చు. గోరా, ఆయనకుటుంబసభ్యులు కొందరి ఆధ్వర్యంలో నాస్తిక ప్రచారం, జయగోపాల్, రామకృష్ణగార్లనాస్తిక ఉద్యమం, హేతువాద సంఘం పేరు మీద రావిపూడి, యస్. వి. రావు, కత్తి పద్మారావుల హేతువాద ఉద్యమం వీటిల్లో చెప్పుకోతగ్గవి వీటిల్లోకూడ ఎస్. వి. రావు, పద్మారావుగార్ల నాయకత్వంలో వున్న సంఘం ప్రజల్లో ఎక్కువగా పని చేస్తున్నట్లు కనబడుతుంది. వీరి అధికారపత్రిక "హేతువాదం". గోరా, ఆయన అనుచరులుగానీ, రావిపూడి వెంకటాద్రిగానీ పూర్తిగా మార్క్సిస్టు వ్యతిరేకులుగా, కేవలం నాస్తిక, హేతువాద భావాలను మాత్రమే ప్రచారం చేస్తూ, కమ్యూనిస్టు వ్యతిరేకతని బహిరంగంగానే వెలిబుచ్చుతున్నారు కానీ ఎస్. వి. రావుగారి సంఘసభ్యులు తాము మార్క్సిస్టులమేనని చెప్పుకుంటున్నారు కనుక వీరి ఉద్యమాన్ని జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఎంతయినా వుంది. అందువల్ల ఈనాయకుల ఉపన్యాసాలను, రచనలను వారి పత్రికల ఆధారంగానే పరిశీలించడానికి పూనుకుంటున్నాను.

గుంటూరు జిల్లా హేతువాదసంఘ 5వ మహాసభల ప్రారంభోపన్యాసంలో అధ్యక్షులు ఎస్. వి. రావుగారు మాట్లాడుతూ హేతువాదమంటే కార్యకారణ సంబంధాన్ని శాస్త్రీయంగా విశ్లేషించడం, ప్రతిదానిని ప్రశ్నించి తెలుసుకోవడం, నిత్యం సత్యాన్వేషణ చేయడం, దేనినీ గుడ్డిగా నమ్మకపోవడం, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికరంగాలలో నిత్యం దోపిడీకి గురవుతున్న అమాయక పేదప్రజానీకాన్ని కుల, మత, కర్మ సిద్ధాంతాల మత్తునుండి మేల్కొలిపి విప్లవోన్ముఖులను చేయటం ఈ సమాజం అద్భుతశక్తులవల్లగాని, బాబాలమహిమలవల్లగాని, మానవాతీతమైన దైవశక్తులవల్లగాని మారేదిగాదని, అది మానవసమాజం యొక్క సృజనాత్మక ఆలోచనాశక్తి, హేతుదృష్టితో కూడిన సమష్టి కార్యాచరణ ఫలితంగా మాత్రమే మారగలదనీ భౌతికశాస్త్రీయ సత్యాన్ని ప్రచారం చేయటం ద్వారా ప్రజలను చైతన్యవంతులనుచేసి వారిని సమ సమాజ నిర్మాణం కొరకు ఉత్తేజపరచి సిద్ధంచేయటమే హేతువాద ఉద్యమ కార్యక్రమం" అన్నారు. అంతేగాక సమాజంలో కులాలు, మతాలవల్ల

సామాజిక వ్యవస్థలో ఏర్పడుతున్న దుర్లక్షణాలను ఏకరువుపెట్టి "ఏసామాజిక వ్యవస్థ కారణంగా ఈ దుర్లక్షణాలు ఉద్భవించాయో ఆవ్యవస్థను పూర్తిగా మార్చవలసిన అవసరాన్ని గుర్తించాలి," అంటారు. ఇంకా "ఆ మితవాద మతవాద భావాలతో కరడుగట్టి చలనరహితంగా, ప్రగతి రహితంగా తయారయిన ఆర్థిక సామాజిక వ్యవస్థను మార్చడానికి పూనుకున్నదే హేతువాద ఉద్యమం" అని "అందుచేత కరడుకట్టిన కులతత్వ, మతతత్వ కర్మ సిద్ధాంతాల సంస్కృతి, పెట్టుబడిదారీ ఆర్థిక దోపిడీ విధానం అంతర్లీనమై పరస్పరం సహకరించు కుంటూ సహజీవనం చేస్తున్న ఈ దేశంలో విప్లవం విజయవంతంకావడానికి అనుసరించవలసిన మార్గం ఏమిటి? యిదేనేడు మనముందున్న సమస్య." అని తేల్చారు.

అంటే హేతువాద ఉద్యమం కేవలం సాంస్కృతిక రంగంలో పనిచేసే సాంస్కృతిక సంస్థకాదన్నమాట. మూఢనమ్మకాలకు, బాబాల అమ్మల మోసాలకు వ్యతిరేకంగా ప్రజల్లో శాస్త్రీయ భావాలనుపెంచే సంస్థ మాత్రమేకాదన్నమాట, కుల మతతత్వాలకు వ్యతిరేకంగానే పనిచేసే సంస్థ కాదన్నమాట. వీటితో పాటు సమాజాన్ని మార్చడానికి విప్లవం విజయవంతం కావడానికి పూనుకుంటున్న, కృషి చేస్తున్న సంస్థ అన్నమాట. ఇక్కడే వీళ్ళు చెప్పేదానిని, చేసేదానిని జాగ్రత్తగా గమనించవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఆర్థిక సామాజిక వ్యవస్థను మార్చడానికి, అంటే దేశంలో విప్లవం విజయవంతంకావడానికి కావలసినవి కా॥ మావో చెప్పినట్లు విప్లవకరసిద్ధాంతంగల కార్మిక వర్గపార్టీ, ప్రజాసైన్యం, ఐక్యసంఘటన. ఈ మూడింటిలో ఏదిలోపించినా విప్లవం విజయవంతంగాదు. అంతేగాకుండా మన సమాజ స్వరూపాన్ని సరిగ్గా అంచనావేసుకోవాలి. విప్లవంలో కలిసివచ్చే వర్గాలేవో, వ్యతిరేకవర్గాలేవో నిర్ణయించాలి కలిసివచ్చేశక్తులన్నింటినీ కలుపుకురావడానికి తగిన కార్యక్రమంద్వారా వర్గపోరాటాన్ని తీవ్రతరం జేస్తూ శతృవర్గాలను బలహీనపర్చడానికి పూనుకోవాలి. అంటే విప్లవవిజయానికి తగిన వ్యూహం, ఎత్తుగడలను రచించుకోవాలి. ఇవేవీ లేకుండా విప్లవవిజయాన్ని గూర్చిమాట్లాడటమంటే అది విప్లవవాగాడంబరం తప్ప మరేమీకాదు. ఈ దేశంలోవున్న విప్లవపార్టీల మధ్య ఎత్తుగడలవిషయాల్లో ఎన్ని భిన్నాభిప్రాయాలున్నా మన సామాజికవ్యవస్థ 'అర్థభూస్వామ్య అర్ధవలసవ్యవస్థ' అనీ ఇక్కడ పార్లమెంటరీ పంథాలోకాక సాయుధ పోరాటం ద్వారానే విప్లవం విజయవంతమవుతుందనే విషయంలో ఏకాభిప్రాయమేవుంది. సిపిఐ, సిపిఎం

లాంటిపార్టీలు కమ్యూనిస్టులుగా చెలామణీ అవుతూ విప్లవం పేరుతోనే విప్లవానికి విద్రోహం చేసి పార్లమెంటరీపంథాకే కట్టుబడి భూస్వామ్య, బూర్జువా వర్గాలకు ఊడిగం చేస్తూన్నవిషయం కళ్ళున్న ప్రతివాడికి తెలుసు. విప్లవాన్ని గూర్చిమాట్లాడే వాళ్ళు ముందుగా ఈ రివిజనిస్టు పార్టీలు, విప్లవపార్టీల మధ్య భేదానుగ్రహించ వలసివుంది కాని హేతువాదఉద్యమ నాయకులకు రివిజనిజం ప్రమాదం గురించిన అవగాహనలేదు ఈ వ్యవస్థను గురించిన సరైన అవగాహనలేదు. విప్లవవిజయానికి అవసరమైన పార్టీ, సైన్యం, ఐక్యసంఘటన, వ్యూహం ఎత్తుగడల గురించి పట్టదు. కానీ విప్లవం గూర్చిమాట్లాడుతున్నారు.

'హేతువాదం' మార్చి 84 సంచికలో 'స్వర్ణకుమారి" గారు 'నేటికులరాజకీయాలు' అనేవ్యాసంలో "భారతీయదోపిడీవ్యవస్థమొత్తం ఆర్థికంగా పెట్టుబడిదారీ విధానం మీదను రాజకీయంగా కులం పునాదులమీదను నిర్మింపబడిందనుటలో అత్యుక్తిలేదు " అన్నారు. భారత ఆర్థికవ్యవస్థ పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థకాదు అర్థవలస అర్థభూస్వామ్య వ్యవస్థ. అదేవ్యాసంలో "ఈ నాటికీ మధ్య తరగతిని దాటి శ్రామిక ప్రజల గుండెల్లోకి పెక్కు ఉద్యమాలుపోలేకపోతున్నాయి. అక్కడిదాక వెళ్ళినవారిలో ప్రజా విప్లవాన్ని విజయవంతముజేసే సక్రమమైన వ్యూహం కనిపించడంలేదు." అన్నారు. వాస్తవానికి మధ్యతరగతి ప్రజానీకాన్నిదాటి శ్రామిక ప్రజల్లోకి పోలేకపోతున్న ఉద్యమాలు హేతువాద నాస్తిక ఉద్యమాలే శ్రీకాకుళం, విశాఖ, తూర్పుగోదావరి, ఆదిలాబాద్ జిల్లాలలోని గిరిజనులను, కరీంనగర్, నిజామాబాద్, వరంగల్ మొదలగు చోట్ల పేదరైతు వ్యవసాయకూలీలను, బీహారు, ధర్మపురి ప్రాంతాలలో హరిజన, వ్యవసాయకూలీలను, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలోని గిరిజనరైతాంగాన్ని, బెంగాల్ తదితరప్రాంతాలలో పేదరైతాంగాన్ని చైతన్యవంతులనుచేస్తూ, దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా సాయుధులనుచేస్తున్న మార్క్సిస్టు-లెనినిస్టుల కార్యక్రమాలు వీళ్ళకు కనిపించకపోవడం ఆశ్చర్యమేమరి మావో ఆలోచనా విధానం మార్గదర్శకత్వంలో దీర్ఘకాలిక సాయుధ పోరాటం ద్వారా పల్లెలను విముక్తి చేసి పట్టణాలను చుట్టు ముట్టాలనే వ్యూహం కన్నాగొప్ప వ్యూహం 'హేతువాదసంఘం' కనిపెట్టిందేమో!

సామాజిక విప్లవాన్ని విజయవంతం చేయడానికి పూనుకున్నామని చెప్పుకుంటున్న వీళ్ళకున్న రాజకీయ పరిజ్ఞానం ఇది. అంతేకాదు విప్లవాన్ని గూర్చి

మాట్లాడుతున్న వీళ్ళు పూర్తిగా మార్క్సిస్టు వ్యతిరేక భావాలను ప్రచారం చేస్తున్నారు. వాటిని సరిగ్గా గుర్తించి వాటికి వ్యతిరేకంగా సైద్ధాంతిక పోరాటాన్ని ముందుకుతీసుకు పోకపోతే వీళ్ళు విప్లవాభిమానులైనయువతరాన్ని గందరగోళపరిచే ప్రమాదముంది.

ఎస్. వి. రావుగారి ఉపన్యాసంలో "కులమత సంస్కృతి కేవలం పెట్టుబడి దారీ ఆర్థిక దోపిడీ విధానం యొక్క నీడ మాత్రమేనని అందుచేత ఆర్థికదోపిడిని నిర్మూలించటంతోనే మత సంస్కృతి దానంతటదే అదృశ్యమైపోతున్నదనే వాదన వుంది. ఈ వాదనతో హేతువాద ఉద్యమం ఏకీభవించలేక పోతున్నది." అన్నారు. "ఈపరిస్థితులలో ఆర్థికదోపిడీ నిర్మూలన ముందా? సాంస్కృతిక దోపిడీ నిర్మూలన ముందా? ఏదిదేనిమీద ఆధారపడివుంది? ఏదిదేనికి మూలం అనేది ఇక్కడ చర్చ నీయాంశాలుకాదు" అనికూడ అంటారు. అంతటితోపూరుకోక "కాబట్టి ఆర్థిక సమస్యలు పరిష్కారం కావటంతోనే మతోన్మాదం. కులోన్మాదం తగ్గిపోతాయను కోవటం ప్రపంచంలోనూ, భారతదేశంలోనూ నడుస్తున్న చరిత్రగతిని అర్థం చేసు కోలేక పోవటమే" అంటూపోలెండ్, ఇరాన్, ఇరాక్, ఇజ్రాయిల్ ఉదాహరణ లిచ్చారు

'నేటికులరాజకీయాలు' అన్నవ్యాసంలో 'స్వర్ణకుమారి' గారుకూడ "ఎత్తుగడల తో ప్రభుత్వాన్ని పట్టుకున్నాక వ్యవస్థను మార్చుతాము అనేదికల్ల. ప్రజల్లో చైతన్యం లేకుండా, వారు ఆలోచించకుండా రాజ్యాలు మనచేతికిరావు. అదివిప్లవంకాదు ఒక మతవాదితో, విప్లవ వ్యతిరేకితో ఎత్తుగడలతో చేయిగలపడం వలన ప్రజలు మనల్ని నమ్మరు అనేదిసత్యం. కేంద్రస్థాయిలో ఇతడితో కలపడం, రాష్ట్రస్థాయిలో విభేదిం చడం వంటి వ్యూహాలవల్ల విప్లవాలు విజయవంతంకావు" అంటూ మరింత గందర గోళంగా వ్రాశారు.

ఇదే మౌలికమైన సమస్య, ఆర్థికదోపిడీనిర్మూలన ముందా, సాంస్కృతిక దోపిడీ నిర్మూలన ముందా అనేది ఇక్కడ చర్చనీయాంశంకాదంటూనే ఎస్.వి.రావు గారు ఆర్థికసమస్యలు పరిష్కరించినంతనే కులోన్మాదం, మతోన్మాదం తగ్గిపోతా యనుకోవడం భ్రమఅంటున్నారు అంటే అంతిమంగా సాంస్కృతిక విప్లవంముందు జరిగితేతప్ప సామాజిక విప్లవంజరగదని చెప్తున్నారన్నమాట. అందుకే 'స్వర్ణకుమారి' గారుకూడ ఎత్తుగడలతో ప్రభుత్వాన్ని పట్టుకున్నాక వ్యవస్థను మార్చుతాము అనేదికల్ల అంటున్నారు. ప్రభుత్వాన్ని పట్టుకోవడమంటే రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవడం.

అంటే ఆర్థిక దోపిడీనిముందు నిర్మూలించి తర్వాత సాంస్కృతిక దోపిడీని నిర్మూలించడానికి కృషిచేయడం అసాధ్యమని స్వర్ణకుమారిగారి ఉద్దేశమన్నమాట

ఆర్థికదోపిడీని నిర్మూలించటంతోనే మతసంస్కృతిదానంతటదే అదృశ్యమైపోతుందనే వాదన ఎవరుచేస్తున్నారో నిరూపించవలసిన బాధ్యత ఎస్. వి. రావుగారిమీదవుంది. మతసంస్కృతి దానంతటదే అదృశ్యమైపోతుందని మార్క్సిస్టులెవ్వరూ అన్నరు. కులమతసంస్కృతిని పెంచిపోషిస్తున్న ఈ అర్థవలస అర్థభూస్వామ్య వ్యవస్థను నిర్మూలించిన తర్వాత అంటే ఈ విధమైన భావజాలానికి మూలమైన పునాదిని మార్చిన తర్వాత ఉపరి తలాంశాలలో మార్పు తీసుకురావడానికి మార్గం సుగామమవుతుంది. సాంస్కృతికరంగంలో మార్పు అంటే భావజాలంలో మార్పు తీసుకురావడానికి తగినకృషి చేయడానికి వీలుపడుతుంది. అధికారంలోకివచ్చిన గతితార్కిక భౌతికవాద దృక్పథంగల్గిన కార్మికవర్గం మతదోపిడీని నిర్మూలించటానికి తగినచర్యలను తీసుకుంటుంది. రష్యా, చైనాలలో విప్లవాలు విజయవంతమైన వెంటనే మతవ్యతిరేకచర్యలు పెద్దఎత్తున చేపట్టడం గమనించవచ్చు. ఆర్థికదోపిడీ మారిన వెంటనే సాంస్కృతిక దోపిడీదానంతటదే రూపుమాసిపోదు. తరతరాలుగా సంవరాన జీర్ణించుకపోయిన భావజాలాన్ని ప్రజలమనస్సులనుండి పారద్రోలటానికి తీవ్రమైనకృషి చేయవలసివుంటుంది. గతితార్కిక భౌతికవాదాన్ని విస్తృతంగా ప్రచారంచేయడం ద్వారా శాస్త్రీయ దృక్పథాన్ని కలిగించడం తేలిక. ప్రభుత్వపరంగా మతప్రచారం జరగదు కనుకనూ, బాబాలు, అమ్మలలాంటి మోసగాళ్ళకు సమాజంలో చోటుండదుగాబట్టి, ఇటువంటి వాటిపై ప్రజలదృష్టిమళ్ళడానికి ఆస్కారంవుండదు. వాస్తవం ఇదైవుండగా "ప్రభుత్వాన్ని పట్టుకున్నాక వ్యవస్థనుమార్చుతాము అనేది కల్ల" అనటం. అంటే హేతువాదులు తమకార్యక్రమాలనుండి కూడ ఎటువంటి గుణపాఠాలు తీసుకొనడంలేదన్నమాట. ఆమధ్య రేడియోలో మతప్రచారానికి వ్యతిరేకంగా ధర్నాచేశారు. బాలయోగిని పరిశీలించాలని పోయారు. సత్యసాయిబాబాను పరిశీలించడానికి డా॥ కోవూరునుండి కూడా ప్రయత్నాలు జరిగాయి. కాని ఫలితమేమిటి? రేడియోలో మతప్రచారం ఆగకపోవడం, సాయిబాబా, బాలయోగిలాంటి వాళ్ళను పరిశీలించడానికి అవకాశం లేకపోవడం, జనంలో వాళ్ళకున్న ప్రభావం ఏమీ తగ్గకుండ వుండటానికి కారణమేమిటి? వీటిని హేతువాదసంఘం ఏవిధంగా సాధిస్తుంది అన్నప్రశ్నలు వీళ్ళు 'వేసుకోవడంలేదు. బాబాలను, మతాన్ని, కుల తత్వాలను పెంచిపోషిస్తున్న ఈనాటి పాలకవర్గాలను కూల్చినపుడు మాత్రమే పై

కార్యక్రమాలు సఫలమవుతాయన్న అవగాహన వీళ్ళకులేదు. హేతువాదసంఘ ప్రధాన కార్యదర్శి పద్మారావుగారు వ్రాసిన 'కులంపునాదులు' పుస్తకంలోకూడ కులమత భావాలు ప్రజలమనస్సుల్లోనుండి తొలగిపోయిదే ఏవిధమైన విప్లవభావాలు వాళ్ళ మనస్సుల్లోనికి ఎక్కించలేము అంటాడు. దీనినిబట్టి విప్లవం విజయవంతం కావ దానికి ముందుగా కుల, మత వ్యతిరేక చైతన్యం ప్రజల్లో రావాలని ఇది జరగందే విప్లవం విజయవంతంగాదని వీళ్ళు ప్రతిపాదిస్తున్నారు. అవిధంగా దేశంలో జరగాల్సిన వర్గపోరాటాలనుండి ప్రజలను దూరంజేయడానికి ప్రయత్నిస్తున్నారు. యువకులకు హేతువాద ప్రచారమే తక్షణకర్తవ్యం అనే భావాలను కలిగిస్తూ ఇదే విప్లవకార్యక్రమంగా చెప్తున్నారు వాళ్ళ పత్రికలో వార్తలను రిపోర్టు చేసేటప్పుడు కూడ మతప్రచారానికి వ్యతిరేకంగానూ, బాబాలకువ్యతిరేకంగానూ, కార్యక్రమాలు తీసుకోవటం ద్వారా విప్లవ చైతన్యాని కలిగించినట్లు వ్రాసుకుంటున్నారు. ఈవిధంగా పూర్తి మార్క్సిస్టు వ్యతిరేక భావాలను ప్రచారం చేస్తున్నారు.

అయితే సామాజిక వ్యవస్థను మార్చటానికి పూనుకున్నామని విప్లవాన్ని విజయవంతంచేయ కంకణం కట్టుకున్నామని చెప్పుకుంటున్న వీళ్ళకు దేశరాజకీయాలగూర్చి ఎటువంటి అభిప్రాయాలున్నవో తెలుసుకోవలసిన అవసరం ఎంతయినావుంది. నేటి మన కుల రాజకీయాలు 'అన్నవ్యాసంలో' స్వర్ణకుమారిగారు తెలుగుదేశం ప్రభుత్వాన్ని "కులతత్వంతో నిండిన ధనికవర్గం" అని విమర్శిస్తుంటే అదే సంచికలో "శీలం" అనేవ్యాసంలో "మహిళల సమాన హక్కుల చట్టాల్ని చిత్తశుద్ధితో అమలు పరచ నున్న మన ప్రియతమ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ" యన్. టి. రామారావు అన్నగారికి యావత్ మహిళాలోకం కృతజ్ఞతాంజలి సమర్పించాలి" అంటూ 'కులతత్వంతో నిండిన ధనికవర్గ' ప్రతినిధియైన రామారావు మీద స్త్రీలలో భ్రమలు పెరిగేలా స్వరూపరాణిగారు వ్రాస్తున్నారు. ఇలాపాలక వర్గాలమీద భ్రమలను పెంచే ఉద్యమం విప్లవాన్ని విజయవంతం చేస్తుందా? సిపిఐ సిపిఎం లాంటి రివిజనిస్టుపార్టీలవాళ్ళనూ, విప్లవోద్యమంనుండి తోసివేయబడ్డ నానా కంగాళీగాళ్ళను పోగుచేసుకుంటున్నవీళ్ళు విప్లవాన్నిగూర్చి మాట్లాడటం హాస్యాస్పదం. అంతేగాదు ఒకపత్రిక విప్లవంగూర్చి మాట్లాడుతున్న వీళ్ళకు రాజకీయాలగూర్చి వున్న అభిప్రాయాలు చూడండి. "అందుచేత హేతువాద రహిత ఆలోచనా విధానానికి, మతమౌఢ్యానికి వ్యతిరేకంగా నడుస్తున్న పోరాటాన్ని నేడు అమలులోవున్న బూర్జువా అధికార రాజకీయరంగానికి దూరంగా సాంఘిక

సాంస్కృతిక ఉద్యమంగా నడపవలసిన అవసరం ఉందని ఆలోచనాపరులూ, ప్రగతిశీల మేధావులు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను" (ఎస్.వి. రావుగారి అధ్యక్షోపన్యాసం) అంటే బూర్జువారాజకీయాలలో పాల్గొనకుండా కేవలం సాంఘిక సాంస్కృతిక ఉద్యమంగా నడుపుతారన్నమాట. సాంఘిక, సాంస్కృతికఉద్యమం సమాజాన్నిమార్చుతుందా? అయితే ఉద్యమంలో మాత్రం బూర్జువా రాజకీయాలకు చెందిన వాళ్ళంత సభ్యులుగా కొనసాగవచ్చునుకుంటాను గుంటూరుజిల్లా హేతువాద సంఘసభల సందర్భంగా ఏర్పాటైన బహిరంగసభలో మాట్లాడుతూ జిల్లా అధ్యక్షుడుఅవుతు సుబ్బారావుగారు నేడు మనదేశంలో సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాలను నిర్లక్ష్యం చేసినందువల్లనే కుల, మతతత్వాలు విజృంభించి, సమాజ అభ్యుదయాన్నే దెబ్బతీస్తున్నాయని, అందుచేత రాజకీయాలకు అతీతంగా ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళవలసిన ఆవశ్యకత ఎంతయినావున్నదన్నారు. వీటిని బట్టి రాజకీయాలకు అతీతంగా జరిగే సాంస్కృతిక ఉద్యమం ద్వారా విప్లవాన్ని విజయవంతం చేయడానికి పనిచేస్తున్నామని వీరు చెప్పటం ప్రజల్ని మోసగించడం తప్పవేరుగాదు.

కుల, మత, మూఢనమ్మకాల ప్రభావం మన సమాజం మీద బలంగావున్న నాస్తవంకాదనలేనిది. దీనికి వ్యతిరేకంగా పెద్దఎత్తున ప్రచారం జరగవలసిన అవసరం కూడ నిర్లక్ష్యం చేయరానిది. అయితే ఇది వర్గపోరాటంలో భాగంగా జరగాల్సివుంది. గతితార్కిక చారిత్రిక భౌతిక వాదాన్ని విశాలప్రజారాశులమధ్య ప్రచారం చేస్తూ, వారిలో వర్గచైతన్యాన్నిపెంచుతూ వర్గపోరాటాన్ని ముందుకు తీసుకు పోవడం ద్వారా ఈ దుర్లక్షణాలను ప్రజలనుండి దూరంచేయగలం. దానిని గుర్తించబట్టే గద్దర్ సాయిబాబా మీద పాటగానీ, 'బాంచెన్ బాంచెనంటు' అనేపాటగానీ, చెరబండరాజు 'ఏ కులమబ్బీ', "మతం కన్న మత్తుమందు" అనేపాటలుగానీ జననాట్యమండలి ప్రచారంలో భాగంగావున్నాయి. సిపిఐ ఎం.ఎల్ (పీపుల్స్‌వార్) ప్రచురించిన 'వ్యవసాయ విప్లవం' అనే డాక్యుమెంటులో చాలావివరంగా మన సమాజంలోని కులవ్యవస్థను విశ్లేషించి వర్ణవ్యవస్థ ఎలా అంతిమంగా వర్గవ్యవస్థకూడా అయ్యిందో వివరించడం జరిగింది. వర్గపోరాటం కార్యక్రమంగా వున్నపార్టీ ఆచరణలో కులాలు పీడిత ప్రజల్ని సమీకరించడానికి అడ్డంకిగావున్నయేమో పరిశీలించి, ఆ అడ్డంకులను తొలగించుకుంటూ పోరాటాన్ని ముందుకు తీసుకు పోతున్నారు. భూస్వామ్య వ్యతిరేకపోరాటాన్ని ముందుకుతీసుకు పోవడానికి ముందు

కథనం :

## జరిమానా

బి. ఎస్. రాములు

నర్సయ్య ఆవూరికొచ్చి వారంగడిచిపోయింది. వాళ్ళవూళ్ళో పోలీసు గాలింపు చర్యలు ఎక్కువగావడంతో దూరపు బంధువులైన వాళ్ళయింటికి వచ్చి చేరుకున్నాడు.

ఎక్కువ రాకపోకలు లేకపోయినా రాకరాకవచ్చినందుకు [ఆప్యాయంగా ఆద రించిందిరాజక్క. బావరోజూ పొద్దున్నేపనికి వెళ్తుంటాడు. సాయంత్రం యింటికి చేరుతుంటాడు.

ఉదయం లేచివెళ్ళి కాలకృత్యాలు తీర్చుకుని పొలాలగట్ల వెంటపోతూపోతూ, వస్తూవస్తూ, ఆవూరివాళ్ళతో మాటకలిపి స్నేహంచేస్తూ స్నానంచేసి యింటికి చేరే సరికి తిండివేళవుతుంది.

తిన్నాకవోసారి బజారుకలయదిరిగి మాటల్లోపడి పగటినిద్రకు యింటికిచేరు తాడు. సాయంత్రం బావవచ్చాక మళ్ళీ ఆవాడలో ముచ్చట్లునడుస్తాయి. మధ్యనెపుడో లేచి నిద్రొస్తుందని వెళ్ళిపోతాడుబావ. రాత్రిపొద్దుపోయేదాక ముచ్చట్లుబెట్టి నిద్ర పోవడం నర్సయ్యకు ఈవారంనించి దినచర్యగా మారింది. ఈవారంలో, చెత్తాచెదారం పేరుకుపోయిన ఆయింటిచుట్టు, వూడ్చి, మొగంపోసి, కంపకొట్టి శుభ్రంచేశాడు.

---

కులాలు, మతాలు పోవాలనే ముందుషరతు (ప్రీకండిషన్)పెడితే ఇవాళ్టి ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, గడ్చరోలీ, తూర్పుగోదావరి, శ్రీకాకుళపోరాటాలు ఇంత ఉధృతంగా ముందుకు వచ్చి వుండేవిగావు.

కాబట్టివైరుధ్యాల పుట్టగావున్న హేతువాద ఉద్యమ కార్యక్రమాన్ని, ఆచరణను విప్లవాభిమానులు నిశితంగా పరిశీలించాల్సివుంది. విప్లవాభిమానులను ముఖ్యంగా యువతరాన్ని గందరగోళపర్చడానికి వారుచేస్తున్న ప్రయత్నాలను ఎండగట్టాల్సి వుంది. రివిజనిస్టులు, మార్క్సిస్టు వ్యతిరేకులు, విప్లవపదజాలంచాటున పోరాట మార్గానుండి యువకులను మళ్ళించడానికి తీవ్రంగా కృషిచేస్తున్నపుడు విప్లవోద్య మాన్ని కాపాడుకోవడానికి ఈ చర్చను ఇంకా ముందుకు కొనసాగించమని మిత్రు లను కోరుతున్నాను.

(ఈ వ్యాసంలోవుదహరించబడిన కొటేషన్లు 'హేతువాదం' మార్చి 84, ఏప్రిల్ 84 సంచికలనుండి తీసుకోబడ్డాయి క్రింది గీతలు నావి)

నిన్నటిదాకా తన విషయంలో మౌనంగావున్న రాజక్క 'బావతోటి పనికి పోతేంది? పుత్రగయింట్లవుంటె ఏమస్తదిర? అంగిలాగు పూర్తిగపాడైనయి. నీకే అక్కరకస్తయిగద' అని అన్నది.

రాజక్కమాటల్లో అబద్ధం ఏమీలేదు. వారంరోజుల్నుండి కూర్చుండి తింటు న్నాడన్న అక్కసుకూడాలేదు. ఎంతో ఆలోచించి ఆప్యాయంగానే చెప్పింది.

ఆమాటలు నర్సయ్యను మరొకలాగా బాధించాయి. నిజం చెప్పాలంటే తాను గత ఆరునెలల్నించి ఒక డ్రెస్సుకుట్టించు కోవాలనుకుంటున్నాడు. ఆర్థికంగా పెసులు బాటు దొరకడంలేదు. తనమీదమోపబడ్డ కేసులకోసం కోర్టులచుట్టూ తిరగడంతోనే సరిపోయింది. అక్టోబరు నవంబరునెలల్లో సారాపోరాటం ఉధృతం చేయడంతో ఎంత తప్పుకు తిరిగినా పోలీసుల బారినుంచి తప్పించుకు పోలేకపోయాడు. పాత కేసులకు హాజరివ్వడానికి కోర్టుకువెళ్ళినపుడు కోర్టు ఆవరణలోనే అరెస్టుచేసి వారం రోజులు తీవ్రింగాహింసించి కేసుపెట్టి జైలుకుతోలారు.

మళ్ళీ బెయిలుమంజూరయి జమానతుదార్లుదొరికి బయటకి వచ్చేసరికి అయిదు వందలు అప్పుపెరిగింది. కొట్టకుండావుండేందుకని రెండువందలు అమీనుకిచ్చాడు తండ్రి. తాను అలాంటిపనులుచేయద్దని ఎంతమొత్తుకున్నా 'యివ్వయివ్వ' అంటూనే యిచ్చాడు తండ్రి.

డ్రెస్సుకుట్టించుకుంటే అప్పు పెరగడమేనని వూరొకున్నాడు. అలా వెళ్ళదీస్తు న్నాడు. మళ్ళీ యింతలో కోర్టుకుకేసుహాజరుకై వెళాల్సివుంది. ఈడ్రెస్సుమరీపాడయి పోయింది. ప్యాంటుమోకాళ్ళమీద రంగువెలిసిపోయింది. కుట్లు ఎక్కడికక్కడ వూడి పోతున్నాయి.

రాజక్క అన్నదివాస్తవమే. కాని నర్సయ్య తెగబాధపడి పోతున్నాడు. ఇంటి పట్టునవుండి కొద్దికాలమైనా బావలాగా తృప్తిగా బతకగలిగితే ఎంతబాగుండు? కాని! పోరాటం చేయనిదే బ్రతకలేని స్థితి.

ఎందుకో గతమంతా కళ్ళముందు కదిలింది. ఓ పన్నెండుమంది యువకులుకలిసి ఆరేళ్ళకిత్రితం ఆవూళ్ళో సంగంపెట్టి రైతుకూలీలను సమీకరించారు. అలాదూరంనించి ఆసక్తిగాచూసేనర్సయ్య కొన్నాళ్ళకు సంగానికే అంటుకుపోయాడు. నాడు రెండు రూపాయలున్న స్త్రీలకూలి నేడు ఏడురూపాయలకు, మూడురూపాయలున్న మగకూలి

పన్నెండురూపాయలకు పెరిగింది. ఆరువందలున్న పాలేరుజీతాలు నేడు వయస్సుల వారీగా పద్దెనిమిదివంచి యిరవై ఎనిమిదివందలదాకా పెరిగింది.

పదిహేడేళ్ళ నర్సయ్య వయస్సు యిరవైమూడేళ్ళకు పెరిగింది. తొలుత మొదలుపెట్టినవాళ్ళల్లో రంగయ్య సంగంలో చురుకుగా పనిచేయడం మానుకుని. పోలీసుల నిర్బంధానికి భయపడి పారిపోయి వేరేతాలూకాలో ఏదోపనిచేసుకుని బతుకుతున్నాడు.

శాలోల్ల వెంకటయ్య మాదిగోల్ల రాజయ్య యూజీకి వెళ్ళిపోయి రెండేండ్లవుతోంది.

నర్సయ్యకూడా ఎన్నోసార్లు యూజీకి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. ఎందుకోగాని అలానేవుండిపోయాడు. నేడు ఆవూళ్ళో సంగంప్రధానబాధ్యులైన అయిదుగురిలో ఒకడు. వాస్తవంచెప్పాలంటే ఆ అయిదుగురిలో ఎన్నుకోబడని కార్యదర్శి నర్సయ్య.

అందువల్ల పనిఒత్తిడి, పోలీసుఒత్తిడి పెరుగుతున్నది ప్రస్తుతం అటోయిటో తేల్చుకోవాల్సిన పరిస్థితి. ఈస్థితిలో పూర్తిగా సంగంబాధ్యతలు తప్పుకుని ఆవూళ్ళో బతకగలగటం అసంభవం. యూజీకి వెళ్ళడానికి తయారవుతున్నా తండ్రి పెళ్ళిచేసుకొమ్మని పోరుపెడుతున్నాడు. నర్సయ్యను మనస్సు ఏమూల పీకుతుందో ఏమో సందిగ్ధంలో పడిపోయాడు.

ప్రస్తుతస్థితిలో జీవితంలో పెళ్ళిచేసుకొని బతకాలంటే ఆవూళ్ళో అన్నిటికీ రాజీపడాల్సిందే. నిర్బంధం భరించలేక బతుకుతో రాజీపడి సంగంతో తెగతెంపులు చేసికొన్నా బొందయ్యను వూరిదొరలు పోలీసులు ఏ గతి పట్టించారో నర్సయ్య కళ్ళారా చూసి ఆబతుకుబతకద్దు అనుకొన్నాడు. సంగంతో తెగతెంపులు చేసికొన్నా పోలీసులు దొరలువూర్కోలేదు. సంగపోల్లజాడలు చెప్పుమని ఎవరెవరువచ్చి కల్సిపోయేటోల్లని నిర్బంధించారు.

ఏవో కొన్నిపేర్లు, సంగపోల్లు రెండు మూడుసార్లు హెచ్చరించినా పోలీసుల (బాధ)కు మళ్ళీ చెప్పడంతో సంగపోల్లు కూడా బొందయ్యకు దేహశుద్ధి చేయక తప్పిందికాదు. అందులో నర్సయ్య ప్రధానపాత్రధారి. చూస్తూచూస్తూ ఆబతుకు బతకాలంటే అసహ్యంగావుంది.

యూజీకి పోవాలని వున్నా ఎందుకో తండ్రిమాటలు నర్సయ్యను ఆకట్టుకొంటున్నాయి. అందువల్ల ఆలోచనలు మరోవైపుతిరిగాయి. ప్రస్తుతస్థితిలో పెళ్ళిచేసికొని బతకాలంటే ఆవూరు వదిలిపెడితేనే సాధ్యం. రెండుపంటలు పండే పదిహేనుగుంటల పొలం, అయిదుగజాల యిల్లువదిలి ఎందుకు బికారిలాగా బతకాలి? పొలం యిల్లూ అమ్ముకొని వూళ్ళు తిరగాల్సిన గతి ఏంపట్టింది? పొలం యిల్లుతో పాటు పెళ్ళిచేసుకొని సగౌరవంగా రాజీపడకుండా ఆవూళ్ళోనే ఎందుకు బతకకూడదు? ఎవడికేం అన్యాయంచేశాడని?

ఎండకాలం ఎండిపోయేకుంటలో జగన్‌రావు శనగవేసికొంటుంటే ప్రస్తుతం పోరాడి ఆ యిరవై ఎకరాలలో శనగను సంగపోల్లే వేసుకొంటున్నారు.

రంగారావు తనయని చెప్పుకొని ఎన్నేళ్ళనుంచో అనుభవిస్తున్న చింతలు సంగం పోరాటంచెయ్యడంతో, - ల్యాండు రికార్డు, సర్వేవాళ్ళ కొలతల్లో అవి ప్రభుత్వజాగాలో వున్నాయని తేలడంతో అప్పటినించి సంగమే అనుభవిస్తున్నది. తమవూరికి ఆర్టీపిబస్సు నడిపేందుకు ఉద్యమించి సాధించుకున్నారు.

శిథిలావస్థలోవున్న ఆవూరిమట్టిరోడ్డును కంకరరోడ్డుగా మార్చాలని రెండేళ్ళుగా పోరాడితే ఇటీవల బడ్జటు మంజూరైంది.

వెంకటాద్రిపుకే ఆ కాంటాక్టు దొరికింది. వచ్చినలాభంలో నాల్గోవంతు సర్పంచుకు యిచ్చేపూచీమీద సర్పంచే వెంకటాద్రివుకు కాంటాక్టు వచ్చేట్టుచేశాడని కొందరు చెవులుకొరుక్కున్నారు.

ఎవరైనా మాకొక్కటే అని బయటివాళ్ళని రాకుండాచూసి తామనుకున్నంత కూలిని సాధించుకుని సంగపోల్లు ఆరోడ్డుకోసం పనిచేశారు.

రోడ్డు వెడల్పును రికార్డులోకన్నా ఒక అడుగు తగ్గించిపోయడం, కంకరమీద రోడ్డురోలరు తిప్పకుండానే మట్టిపోయడంతో గొడవమొదలైంది. నాలుగురోజుల్లో గొడవచల్లారింది కాని మరో కేసుపెరిగింది.

సర్పంచు దొంగలెక్కల్ని నిలదీయడంతో గ్రామసభలో జరిగిన అల్లరికి తిరిగి పోలీసు క్యాంపు తెప్పించాడు సర్పంచు. పోలీసులకు దొరికితే పెట్టే చిత్రహింసల బాధవల్ల సంఘం బాధ్యతలదృష్ట్యా పారిపోయినవాళ్ళల్లో నర్సయ్య ఒకడు.

ఉద్యమంలో యింతదూరంసాగిన తానువెనకడుగు వేసినా, ఆగిపోయినా, ఎలా వుంటుంది? నేడు గొప్పగా కీర్తిస్తున్నవాళ్ళే రేపువెక్కిరించకమానరు.

ఒక్కక్షణం ఉద్యమంమీద కోపంవచ్చింది. 'వానియవ్వ! పోరాటం మొదలు పెట్టింది కష్టాలుపోవుటానికా పెరుగుటానికా! తనకైతే కష్టాలు పెరుగుతనే వున్నయి గాని తరుగుతలేవు' అన్పించిందా క్షణం.

మరోక్షణం అలాంటి ఆలోచన తనమనస్సులో ప్రవేశించినందుకు పశ్చాత్తాపం పొందాడు.

పోరాటం చేయకపోతే జగన్‌రావుపొలంలో తమపొలంకలిసేది. వాడిచ్చిన పైసలు ఏదోకర్చుకు పుట్నాల్లా ఎగిరిపోయేవి. రెండేళ్ళనించి కుంటలో శనగవేస్తే యాభయికిలోలు తన తండ్రివంతుకు వస్తున్నాయి. ఈ చిన్న చిన్నలాభాలకన్నా పెద్ద లాభం ఒకటి జరిగింది. తామంతా తలెత్తుకుని ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా నిలబడ గలుగుతున్నారు. తమసంఘం పలుకుబడి సాంఘిక హోదాపెరిగి దొరలపలుకుబడి తరిగింది. ప్రస్తుతం చిన్నచిన్నవి చాలా సమస్యలుగా రూపుదాల్చకముందే పరిష్కరింపబడుతున్నాయి. అదంతా సంగంవల్ల ఒనగూడిన ఆత్మస్థైర్యంయొక్క ప్రత్యక్ష ఫలితాలు కాదా! సంగమే లేకపోతే ఈవూరు యిలావుండేదా! అంతెందుకు? నర్సిగాడు నర్సయ్యా అని దొరలతో పిలువబడేవాడేనా!

ఉద్యమాన్ని కోపగించినందుకు మనసులోనే తప్పయిందని చెంపలేసుకున్నాడు నర్సయ్య. త్యాగాలులేకుండా కష్టాలులేకుండా పోరాటం విజయవంతంకావడానికి యిదేమైనా వల్లేరుమీది బండినడకనా? తనకు ధైర్యంచచ్చిగాని, ఎంతపోరాడితే అంతేగదా సాధించేది! సంగం ప్రయోజనాలకోసం పనిచేయాలనుకున్నపుడు వ్యక్తిగత స్వార్థం ఎవరైనా సాధ్యమైనంత వదులుకోవాల్సిందేకదా! కష్టాలు తప్పనిసరేకదా!

రాజక్క చెప్పినట్టు పనికిపోతే మంచిదేమో, కాని బావతో బావుల్లో పూడిక తీయడానికి పౌరుషానికి వెళ్ళినా పోలీసు చిత్రహింసలు తిన్నశరీరం సహకరించక పోవచ్చు.

అసలు వూళ్ళోంచి పారిపోకుండా ఉద్యమాన్ని నిర్మించనేరాదా! పోలీసులు రావడం పారిపోవడం ఈపాతపద్ధతిని అధిగమించే మార్గమే లేదా! లేనపుడు వున్న నలుగురు దొరల్నినరికి పారిపోతే వూరిపీడానైనా వదులుతుందిగదా!

అన్న అనుమతిస్తే ఎన్నడోరాలిపోదురు ఈ నలుగురు. అసలు అన్నలు యిలా ఎందుకు తయారైనారు? పూర్వం ఎక్కడపడితే అక్కడ ఖతంఖతం చేసేవాళ్ళు! ఇపుడేమొ మనలను ఎంత తన్నినా ఎన్ని పుల్లెందులపాలుజేసినా ఓపిక! ఓపికపట్టండి అని అంటున్నరెందుకు? అన్నల్లోగూడా ధైర్యంసన్నగిల్లిందా ఏంది! ఎక్కన్నో ఎవలనో ఖతంచేసినట్టూ, కాలుసెయి తీసేసినట్టు, వార్తలస్తున్నయిగని యిక్కడెందుకు చేయద్దు?

వాడుచస్తే అట్లాంటోడు మళ్ళీ ఒకడు తేలుతాడు అనిచెప్తాడు అన్న గట్లంటె గక్కడెందుకు ఖతంచేసినుర్రి అంటె వర్గశత్రువు ప్రవర్తనసుబట్టి అక్కడ తప్పలేదు కాబట్టి చేసినుర్రి అంటడు.

మల్లకొత్తోడు తేలెదాక వాళ్ళకు ఎంతసయం. మేం మాత్రం ఎప్పటికి పాత వాళ్ళతోనే గిట్లనే సచ్చెదాకకొట్లాడుడా? అంటె అన్న నవ్వి వూకుంటడు.

అన్నమీదికి ఆలోచన పోవడంతో ఈవారం రోజుల్నుంచి అన్నను కలిసే ప్రయత్నం చేయనందుకు తనవల్ల పొరపాటు జరిగినట్టు కించపడిపోయాడు. తన ఆలోచనతనదే కాని అన్న ఆలోచన విన్నవాడుకాదాయె. ఇప్పటికైనా అన్నసుకలిస్తే బాగుండు.

తాను ఇక్కడినుంచి ఎక్కడికని వెళ్ళకలుస్తాడు. అన్ననే ఇక్కడికిరావడానికి అడ్రసు ఎలా తెలుస్తుంది? పగటినిద్రపట్టక ఆలోచనలతో అటూయిటూ పొర్లాడు.

'నర్సన్నవున్నడా'

ఎవరో అక్కను అడగడంతో లేచికూర్చున్నాడు. సమ్మయ్య. అన్నవెంట వుంటాడు తాను తనమనసులో అనుకున్నదే తడవుగా కన్పించడంతో పొంగిపొరలిన సంతోషంతో సమ్మయ్యను కౌగలించుకున్నాడు. తననికలవడానికి అన్న మూడు రోజుల్నుంచి గాలిస్తున్నాడని తెలిసాక అన్నపై అభిమానం మరింత పెరిగింది.

అలా మాట్లాడుతుంటే రాజక్క సమ్మయ్యని అన్నంతినుమంది తిన్నానని అన్నా వదల్లేదు రాజక్క 'నావంతుసి సద్దిగట్టియ్య తొవ్వలదింట' అని నవ్వుతూ అంటే ఆమాటమీదే విస్తట్లో సద్దికట్టించి.

సద్దితీసుకుని సమ్మయ్య, నర్సయ్య బయటికి నడిచారు. ఓచోట కరెంటు పంపు పక్కనున్న చెట్టునీడన అన్న - అన్నవెంటవుండే మరోఅతను అచ్చయ్యనవ్వుతూ పలకరించారు.

ఆ అన్నం అన్నా లచ్చయ్యా చెరికొంత తిన్నారు. మొత్తం విషయం తెలిసినా మళ్ళీ నర్సయ్య నోటినించివిన్నాడు అన్న. ఏంచేస్తేబాగుంటుందో తన అభిప్రాయం తెలిపాడు నర్సయ్య.

అన్నీ విన్నాడు అన్న.

'అయితే ఒకల్లదో. యిద్దరియో కాల్లుసేతులన్న తీసేస్తెనే తిక్కకుదురు తదంటవు' అడిగాడు అన్న.

అవునన్నాడు నర్సయ్య

లాలనగాచెప్పాడు అన్న 'పిడుక్కు బియ్యానికి ఒకటేమంత్రిం అంటెఎట్ల? శతృవు మనఎడల ప్రివర్తించే తీరునుబట్టి మనఎత్తుగడలు నిర్ణయించుకొంటాము. శతృవుప్రివర్తన మనని ఆ పరిస్థితిలోకి నెట్టితే అట్లనేచెయ్యాలె మనవూరి విషయానికస్తే ఇది తప్ప వేరేమార్గం లేదంటవా! మునుపటికీ యిప్పటికీ మనవూరి దొరలు ఎంత మారిన్రు! అట్లని మంచోల్లని అంటలేము. శతృవు పిరికితనంతో ఒకోసారి మరీ పిచ్చిగా నిర్బంధం తీవ్రితరం చేస్తాడు. అట్లా పెరుగుతున్న నిర్బంధాన్ని వారిచేతే తగ్గించే ఉపాయాలు ఎత్తుగడలు పద్ధతులు అనుసరించాలె మనం.

ఇప్పటికే మనవూరివాళ్ళు కోర్టులచుట్టూ తిరిగి తిరిగి, విసిగిపోయిన్రు. అప్పులపాలయిన్రు. వ్యవసాయం కుంటుపడుతున్నది. ఈ స్థితిలో ప్రిస్తుతం ప్రితీకారం తీర్చుకునుడు కూడా ముఖ్యమే.

సాంఘికంగానే గాక ఆర్థికంగా కూడా దిగజారిపోతున్నస్థితిలో వర్గశతృవు తనను తాను, తానుగా (వర్గశతృవుగా) యధాస్థితిలో వుండిపోవాలని నిర్బంధాన్ని ఆశ్రియించాడు. మనంవాన్ని మరింత పిరికివాన్నిచేయాలి, వారిని ఆర్థికంగా మరింత దిగజార్చాలె. అదేసమయంలో మనవాళ్ళ ఆర్థిక పరిస్థితి మెరుగు పడగలగాలి. ప్రిస్తుతం మనఎత్తుగడలు ఈలక్ష్యాల్ని సాధించేవిగా వుండాలె. మనపోరాటాలు మలుపు తిరుగుతున్నాయి మన ఎత్తుగడలు కూడా ఆ క్రిమంలో వుండాలె!'

ఆసక్తిగావింటున్న నర్సయ్య 'అబ్బ! గంత మంచిఉపాయాలుగూడవున్నయా! అన్నా' అని సంతోషసంబ్రిమాశ్చర్యాలతో అడిగాడు.

చిరునవ్వుతో మళ్ళీ కొనసాగించాడు అన్న. 'మనపోరాటం ఎదుగుతున్నది. పోరాటప్రింతాలు పెరుగుతున్నాయి. మనమిపుడొక బలమైనశక్తిగా రూపుదిద్దు

కొన్నాం. ప్రస్తుతం మనకు వ్యతిరేకంగా పనిచేస్తున్నవాళ్ళని మనమే అదుపు చేయగలిగేస్థితిలో వున్నాం.

మనవాళ్ళు ఈదొంగకేసులతో ఈకోర్టులచుట్టూ తిరగడంవల్ల ఎంతో నష్టపోయారు. ఈనష్టానికి దొరలేకదా బాధ్యులు! అందువల్ల ఈవకీలుఫీజులు, బస్సు కిరాయలు, పోలీసులు వసూలుచేసుకొనిపోయిన మామూళ్ళు, ఎత్తుకపోయిన సామానులు, నిరుడు పంట కోయనీయకపోతే జరిగిన నష్టం- యివన్నీ లెక్కదీసి ఎవరివల్ల ఎంతనష్టం జరిగిందో అంతమొత్తాన్ని నష్టపరిహారంగా వారినుండి వసూలుచేయాలె. ఇది వాళ్ళమీద మనంవేసే జరిమానా! దీంతో వాళ్ళని వంగదీసినట్టూ అవుతుంది. మనవారికి ఆర్థికంగా ఎంతోకొంత వూరటదొరకడమే కాక ప్రతిసారి పారిపోయే స్థితినుండి వూళ్ళో నిలబడగలిగేస్థితి వస్తుంది. అందుకు ప్రజా పంచాయతీ నిర్వహించండి. ఈవిషయాలన్నీ మనవూళ్ళో అందర్తో ఈపరకే మాట్లాడాను.

నర్సయ్యకు ఈ ఎత్తుగడ ఎంతో నచ్చింది. మనసులోనే లెక్కలు వెయ్య సాగాడు - కనీసం యాభైవేలైనా ఆసల్లురినుండి వసూలు కావలసివుంటాయి. కేవలం తనకొక్కడికే మూడువేలు వాపసువస్తాయి. తమకున్న అప్పుభారం మంచులా కరిగి నీరైనట్టుగా స్వేచ్ఛగా వూపిరిపీల్చాడు. యిది సాధిస్తే కొన్నాళ్ళదాకా వూరు విడిచి పెట్టిపోయే పనిలేదు. అప్పటికి అప్పులేమీ వుండవు. ఇంటిని తమ్ముడు సెట్టుకు రాగలడు. తానుసంగం పనిచేస్తూనే పెళ్ళి చేసికొని కొంతకాలమైనా తృప్తిగా వూళ్ళో వుండగలగడానికీ ఈపద్ధతి ఎంతో బాగుంది. ముఖ్యంగా తాను పెళ్ళి చేసికోవడానికి వున్న అడ్డంకులన్నీ తొలగిపోయినట్టయి గుండెబరువుదిగిపోయి వుల్లాసపడిపోయాడు. పెళ్ళి చేసికొన్నాక కూడా మరింత బాధ్యతగా ఎందుకు సంగం పనులు చేయకూడదు? అలా ఆలోచిస్తున్నంతలో మెల్లగా అన్నమరో విషయం కదిపాడు.

'మీనాయిన్న ఒకటేపోరు. మొన్నకల్సిండు సువ్వన్నజెప్పు. ఈనికి చెయ్యంది చిన్నోనికి చెయ్యరాదాయె అనవట్టె! మరి నీవుద్దేశ్యం ఎట్లున్నది? పెళ్ళి చేసికొంటవా? .... గానడుమ హోల్‌టైమర్ (పూర్తికాలపు కార్యకర్త) నయితనంటివి ఇట్లనేవుంటవా?! హోల్‌టైమర్ వైతవా? నీయిష్టం! నీనిర్ణయమేంటిదో చెప్తె పార్టీ నీగురించి ఆలోచిస్తది'

'నాకు కావాలనేవున్నది. కని మా నాయిన్న తోటేవచ్చింది గోస!' అన్నాడు నర్సయ్య. తన బలహీనతను తండ్రికి అంటగట్టడంగాభావించి చిన్నగా నవ్వాడు

అన్న. 'మరి పిల్లను గిట్ల జాడదీసుకున్నవ? మమ్ములజాతదియ్యమంటవ?' అని అడిగాడు.

ఆ నవ్వు ఎందుకో తనని కత్తిలా కోసినట్టు విలవిలలాడాడు నర్సయ్య. 'నేను సంగానికి, విప్లవానికి దూరంబోవాలని చూస్తలేను. నా మనస్సునిండా పోరాటమే పున్నది. ఈవారంరోజులల్ల మా రాజక్కవూరు ఎట్ల మారిందోసూడు. ఇంకొద్ది రోజులల్ల సంగం బెట్టుకుంటరుసూడు. ఇపుడు నువ్వువోయి ఒక్కసారి కలువు వాల్లు ఎట్ల అగ్గయిమండుతరో తెలుస్తది.' తాను ఈవారం రోజులు వ్యర్థంగా గడపలేదనీ వాళ్ళని చైతన్య పరచడానికే ఈసమయాన్ని వెచ్చించాననీ ముందుముందు కూడా యిలాగే పనిచేస్తాననీ చెప్పాలని ఆరాట పడిపోయాడు, కాని చెప్పలేకపోయాడు. అయినా ఆవిషయం అన్న గ్రహించాడు.

'నిన్ను తక్కువ అంచనావేస్తున్నానని ఎందుకనుకుంటున్నవు. నిత్యం శతృవు కళ్ళెదుట కదులుతూ నిత్యం నిర్బంధాల్ని తట్టుకుంటూ నీవుచేసున్న పని తక్కువ పనేమీకాదు. చేయదల్చుకున్న వారు, ఏరంగంలోనైనా ఏవిధంగానైనా పనిచేయ గలుగుతారు. నువ్వు గట్లెందుకు బాధపడుతవు: పెళ్ళి చేసికోవాలనివుంటే చేసికో' సమాధాన పరిచాడుఅన్న.

'మీరెట్లంటె అట్ల!' అని భారం అన్నమీదనే వేశాడు నర్సయ్య.

అతని అభిప్రాయం చూచాయగ చెప్పాక, యిక తనకు పెద్దరికం యివ్వడం అనేది గౌరవ సూచకంగా మాత్రమే. అందువల్ల నర్సయ్య అభిప్రాయాల్ని మన్నించడమె సరైంది. అని నిశ్చయించుకున్నాడు అన్న.

'నేను నిజంగనె అడుగుతున్న! నీ మనుసుల ఎవరన్న వున్నరా! లేకపోతే నేను నీకునచ్చే పిల్లను జాడదియ్యన్నా!' చాల ప్రసన్నంగా అడిగాడు.

'నీకు బీరుపురం పోశన్నట తెల్వగద అన్నా!'

'కామ్రేడ్ పోశన్ననా! యిపుడు జేల్లనేవున్నడు. ఆకేసుల మూడేండ్లు శిక్ష పడ్డది. తండ్రి ఎన్నడోపాయె. తల్లి ఒకతేవున్నది.'

'పోశన్న చెల్లె లక్ష్మి మంచి పిల్లనేగదా! అన్నా!'

'గట్లడుగవడ్తి వేంది? మొన్నటిదాక వచ్చి ఎక్కడ సంగం మీటింగైనా వచ్చి ఎన్ని పాటలు పాడుతుండె? ఆచెల్లెది ఎంత మంచికంఠం! ఈ నడుమ యింట్ల ఎల్త

లేదని తల్లి ఎటు పోనిస్తలేదు. అయినా!....' అర్థోక్తిగా ఆలోచిస్తూ ఆగిపోయాడు అన్న.

ఆమాటతో నర్సయ్య ఆందోళన పడిపోయాడు. ఏం చెప్తాడోనని ఆశ్చర్యంగా, ఆసక్తిగా అన్న కళ్ళల్లోకి చూశాడు.

పుత్తరందిక్కున దూరం నుంచి పిల్లబాట వెంట వెళ్తున్న వ్యక్తిని పరీక్షగా చూస్తున్నాడు సమ్మయ్య.

కుడిపక్కన కొద్దిదూరంలో కూర్చున్నలచ్చన్న బీడీ ఆఖరు పీల్చి పీల్చి భూమికేసిరాసి ఆసక్తిగా వారిద్దరివేపు చూశాడు. అన్న అలా ఎందుకాగి పోయాడా అని ఆలోచనలో పడ్డాడు. వారిద్దరి కులాలు వేరు. ఆవిషయమే అడ్డంకియా అని అన్నను అడిగాడు అన్నకాదని తల అడ్డంగా వూపాడు.

'గది అడ్డంకి ఎట్లయితది? గని!' అని నర్సయ్యవేపుతిరిగి 'లక్ష్మి హోల్ టైమరుగు వస్తనని వుత్తరంరాసి పంపింది, మరి నీకుతెలుపదా!' తన ఆశ్చర్యానికి అసలుకారణం చెప్పాడు అన్న.

'బా! నాతోటిగుడ గదే మాటన్నది....'సగర్వంగా చెప్పాలనుకుని బిడియ పడి పోయుడు నర్సయ్య.

'అంటే....' ఈసారి ఆశ్చర్య పోవడం అన్న వంతైంది.

నేలకు వాల్చిన తలఎత్తి అన్నకళ్ళల్లోకి చూస్తూ 'నేనుగుడ....కాని పోలీసోల్లు దొరలు గిట్లవూర్లె వుండనిచ్చినన్ని రోజులు వూర్లె వుండుకుంటనే పనిచేద్దామను కుంటున్న. గింట్ల ఏదన్న తప్పుంటె చెప్పునిర్రి సరిదిద్దుకొంట.'

నర్సయ్య మనస్సులోని దృఢదీక్షను సంపూర్ణంగా అర్థంచేసికోలేక పోయి నందుకు కొంత కించపడ్డాడు అన్న. వెంటనే తేరుకుని ఆప్యాయంగా నర్సయ్యను కౌగలించుకున్నాడు.

'హోల్ టైమర్‌గ వస్తనన్న నీమనసులోని మాట నాకుజెప్తె లక్ష్మిని చేసికొంటె మంచిగుంటదని నేనే అని వుందును. అయినా నీకు నువ్వే బాధ్యతగా అన్న ఆసర కోల్పోయిన చెల్లెను కట్నం, కులం పట్టింపులేకుంట పెళ్ళి చేసికొంటున్నవు. పోరాట క్రమంలో చితికిపోయిన కుటుంబాల్ని ఆదుకోవాల్సిన విప్లవకర్తవ్యాన్ని స్వచ్ఛందంగా

# కమ్యూనిస్టు గాడిద!

సాక్షి

చాకలి రాములుకు పూటగడవడం కష్టమయిపోయింది. అతని పరిస్థితి పూర్తిగా దిగజారిపోయింది. ఎంతగా దిగజారిపోయిందంటే తను తన కుటుంబం వారానికి నాలుగురోజులు పస్తులుండాల్సి వస్తే గాడిదను మాత్రం వారం అంతా పస్తులుంచే స్థితికి దిగజారిపోయింది. ఈ కారణంగా అతని గాడిద పూర్తిగా చిక్కి శల్యమై చావుకి కాళ్లజాపుకు కూర్చుంది.

గాడిద తన కళ్లెదుటే చస్తూవుండటం చూసి వూరుకోలేక రాములు దాన్ని వీధి లోకి తరిమెయ్యాలని నిర్ణయించుకొన్నాడు. అనుకొన్నదే ఆలస్యంగా కట్లు విప్పి గాడిదను వీదిలోకి తోలేశాడు.

వీధిలో పడ్డగాడిద యజమానికేసి విస్తుపోయి విచారంగా చూపింది. ఆ చూపుల ధాటికి తట్టుకోలేక చాకలి రాములు "వెళ్ళు వెళ్ళి నీబ్రతుకేదో నువుబ్రతుకు" అంటూ రెండు తగిలించి గుడిసెలోకి వెళ్లి దభీల్న తలుపులు మూసుకొన్నాడు.

కొద్దిసేపటి వంకూ ఏమీ పాలుపోక, ఎటూ తేల్చుకోలేక అలా వీధిలో నిలువునా నిలబడిపోయింది గాడిద. ఆ తర్వాత ఎటువెళ్లాలో దానికి తోచలేదు. ఇటుచూస్తే వూళ్లో సినిమాపోస్టర్లు, చిత్తుకాగితాలు. అటుచూస్తే వూరిచివర కాలువఒడ్డున పచ్చగడ్డి

ఆచరించి నీ ఆచరణతో ఆదర్శంగ నిలుస్తున్నవు. నీకు.... కాదు! మీకు నా విప్ల వాభినందనలు,' అన్న వుద్వేగంగా మరోసారి కౌగలించుకున్నాడు! 'అయితే మీరిద్దరు ఇంతలోనే అదనపుభారం రాకుండ కొంత జాగర్త తీసికోవడం అవసర మేమో' అని తన సూచన వెల్లడించాడు. అన్న.

నర్సన్న వూర్లో వుండుకుంటూ కూడ విప్లవం గూర్చి యింతగా ఆలోచించడం లచ్చన్నకు కలిగించిన ఆనందోద్రేకంలో మాటపెగలలేదు. చూపులతో అభినందనలు తెల్పుతూ చేతిలో చేయికలిపాడు.

అన్న పోరాటం గూర్చిన మెళకువలు మళ్ళీమళ్ళీ చెప్పి సెలవుదీసుకున్నాడు.

ఆ తర్వాత కొన్నిరోజులకే దొరలనుండి సంగం దండుగలు వసూలు చేసిందని, దొరలతో బలవంతంగా పోలీసు క్యాంపుఎత్తివేయించిందని పత్రికల్లో ఓ మూలన వార్త పడింది.

మైదానాలు దానికళ్లల్లో మెదిలాయి. ఎటకేగుటకో సమస్యగా ఘనీభవించిందీ గాడిదకు. ఊళ్లోకువెళ్లి సినిమాపోస్టర్లు, చిత్తుకాగితాలు మేయాలంటే ట్రాఫిక్‌ను తప్పుకోవడానికి నానాహైరానా పడాలి. పైగా తినితాగడానికి అక్కడ నీళ్లకూడా దొరికే అవకాశంలేదు. అందుచేత వూరిచివరికివెళ్లి పచ్చగడ్డి మేసి కాలువలో పచ్చిమంచినీళ్లు తాగవచ్చునను కొని కాళ్లీడ్చుకొంటూ వూరిచివరికి నడిచింది.

అలా కాళ్లీడ్చుకొంటూ వూరుచివరకు చేరుకొనేసరికి గాడిదకు పూర్తిగా నిరాశే ఎదురైంది. పచ్చగడ్డి ముచ్చుకైనా కనిపించలేదు కాలువొడ్డున ఏమైనా వుంటుందే మోనని అక్కడికీ వెళ్లి జాగ్రత్తగా వెదికిచూసింది. పాపం ఆ గాడిదకేంతెలుసు, దేశంలో తెలుగుదేశం, కాంగ్రెసు వర్గాలమధ్యన పచ్చగడ్డివేస్తే భగ్గుమనేట్లుగా వుందని, అవూళ్లోకూడా యీరెండు వర్గాలవారు వున్నారని యిహ పచ్చగడ్డి ఎక్కడుంటుందనీను—

ఆనక చేసేదిలేక అగ్రికులాల వాళ్లు ఎవరైనా చూస్తారని భయంభయంగా అటూయిటూ చూసి కాలువలోని నీరు గటగటాత్రాగేసి వెనక్కితిరిగి వూరికేసి నడక సాగించింది.

ఊళ్లో కొచ్చింతర్వాత అది చిత్తు కాగితాల కోసం రోడ్లన్నీ కలియ-తిరి గింది. ఎక్కడా చిన్నకాగితం ముక్కయినా కనిపించలేదు. అంతకు రొన్నాళ్ల-ముందే దేశంలో కాగితం కొరత ఏర్పడిందని అందువల్ల ప్రభుత్వం కాగితాల మీద కంట్రోలు ఏర్పాటు చేసిందనీ, అప్పట్నుంచీ ప్రజలు మరియు పత్రికల వాళ్లు కాగితాన్ని బహు జాగ్రత్తగా వాడుకుంటున్నారని, అందుకని చెత్తకుండీలలో కూడా వక కాగితం- ముక్క కనబడకుండా పోయిందనీ ఆ గాడిదకు తట్టలేదు. తట్టింతర్వాత దాని బుర్రలో ట్యూబులైటు వెలిగింది. ఇహ సినిమా పోస్టర్లే గత్యంతరమని వాటికేసి చూసింది

పచ్చగడ్డి చిత్తుకాగితాలు దొరక్కపోతే గాడిదలూ, గేదెలూ, గోవులూ అన్నీ కలిసి మూకుమ్మడిగా సినిమా పోస్టర్ల మీదకి ఎగబడవచ్చునని ముందు గానేవూహించిన సినిమాల వాళ్లు పోస్టర్లు చాలా ఎత్తున వేళ్లాడదీసేరు. అందుకని గాడిదకు యీసారి కూడా ఆశాభంగమే కలిగింది. మొదటి సారిగా తను జిరాఫీ అయి పుట్టనందుకూ గాడిదయి పుట్టినందుకూ విచారించింది. ఆ తరవాత చేసేది లేక ఏంచెయ్యాలో తెలియక అచ్చం గాడిదలా వూరంతా

కలియ తిరగసాగింది. అలా తిరుగు తూండగా దానికి కాంగ్రెసు పార్టీ వాళ్లు గోడలమీద అతికించిన పోస్టర్ కనిపించింది. అది దానికి అందుబాటులో వున్నందున ఆలస్యం చేయకుండా ఆదరాబాదరా వెళ్లి దాన్ని నాలికతో తడిపి పూడబెరికి తిన సాగింది. దూరాన్నుంచి యీ వ్యవహారం గమనించిన కాంగ్రెసు కార్యకర్తకి, కచ్చితంగా యిది తెలుగుదేశం వాళ్లపనే అనిపించి పరిగెత్తుకుంటూ వచ్చి అటుగా వెళుతున్న తెలుగుదేశం కార్యకర్తను పట్టుకుని నిలేసి "ఏమిటిది?" అని గాడిదకేసి చూపిస్తూ గర్జించేడు.

ముందు ఏమిటోనని విస్తుపోయిన తెలుగుదేశం కార్యకర్త గాడిద కాంగ్రెసు పోస్టర్ని మేస్తూండడం చూసి అటుతర్వాత కాంగ్రెసు కార్యకర్తకేసి ఎగాదిగా చూసి, చచ్చుప్రశ్నలువేసిన పిల్లాడికేసి పంతులు చూసినట్టు చూసి పెళ్లున పడీపడీ విరగబడి నవ్వేడు.

ద్రౌపదినవ్వుసుజూసి యిన్సల్ట్ఫీలయి ఆనక కోపగించుకొన్న దుర్యోధనుడిలా కోపంతో వూగిపోతూ "గాడిదను తోలి తమాషా చూస్తున్నావటా గాడిదకొడకా" అంటూ మొదలుపెట్టి తిట్లకు లంకించుకున్నాడు కాంగ్రెసు కార్యకర్త.

"ఏం కూసావురా! నువ్వే గాడిదకొడుకువి", అంటూ చేతులు పయికిమడిచి కాంగ్రెస్ కార్యకర్త మీదికి వురికాడు తెలుగుదేశం కార్యకర్త జనం చుట్టూతా చూస్తుండగానే యిద్దరూ కలియపడ్డారు. జనంలోని సింపతైజర్స్ రెండువర్గాలుగా విడిపోయి తిట్టుకొంటూ కొట్టుకోసాగేరు. కొందరు మాత్రం ప్రేక్షకుల్లా చూస్తూ వుండి పోయేరు. జనం అంటే అంతామామూలు మనుషులు కారుగదా! అందులోనూ కొందరు అడుక్కుతినేవాళ్లూ, రౌడీలూ, జేబుదొంగలూ, ఖూనీకోర్లూ, సి. ఐ. డీ. పోలీసులూ వుంటారు. జనంలోంచి వక సి. ఐ. డీ.వెళ్లి పోలీసు స్టేషన్కి ఫోన్ చేసి వచ్చాడు.

వార్త అందుకోగానే ఎస్సయ్గారు అర్జంటుగా కానిస్టేబుళ్లని వెంటపెట్టుకొని హుటాహుటిన బయలుదేరి వచ్చేరు. పోలీసుల్ని చూడగానే పిల్లిని చూసిన ఎలకల్లా ఎక్కడి వాళ్లు అక్కడే గప్చిప్ అన్నట్లుగా జనమంతా తిట్టుకోవడం, కొట్టుకోవడం మానేసారు, ఇన్స్పెక్టరుగారు వ్యాన్ దిగడంతోనే కార్యకర్త లిద్దరిని పిలిచి "ఏం జరిగింద"ని అడిగేడు.

కార్యకర్తలు యిద్దరూ (కాట్లకుక్కల్లా) వకర్నొకరు చూసుకుని తిరిగి ఆవేశ పడిపోతూ వకర్నొకరు తిట్టుకుంటూ విన్నవించుకున్నారు. "వీడు యీ గాడిదను తీసు కొచ్చి దగ్గరుండి మా పోస్టర్‌ని మేపుతున్నాడు" అన్నాడు కాంగెస్ కార్యకర్త. "కాదుసార్ వీడే గాడిదచేత పోస్టర్‌ని మేపి మామీద అన్యాయంగా అపవాదు తోస్తు న్నాడు" అన్నాడు తెలుగుదేశం కార్యకర్త.

"వరేయ్ ఏం కూసావ్‌రా" కోపంగా అన్నాడు కాంగెసు కార్యకర్త.

తలవిదిల్చి "కుయ్యడానికి నేనేమయినా గాడిదనటా్రి పిలా" అరిచాడు తెలుగు దేశం కార్యకర్త.

ఇహ తనుచూస్తూ వూరుకుంటే వాళ్ల తన్నుకోవడం తథ్యం అని తలచి ఇన్స్‌పెక్టరుగారు "ఇక్కడ నేనుండగా మధ్యన మీ గొడవేమిటి?" అన్నాడు.

వాళ్లిద్దరూ నోరుమూసుకున్నారు. ఇన్స్‌పెక్టర్‌గారు వకక్షణం ఆలోచించి, యింకా ఎక్కువసేపు ఆలోచిస్తే తను ఆడిపార్టుమెంటుకి అనర్హుడనని జనం ఎక్కడ తేల్చిపారేస్తారోనన్నట్టుగా వెంటనే, "ఆ గాడిదను అరెస్టుచేయండి" అని కానిస్టేబు ల్స్‌ని ఆజ్ఞాపించేడు.

ఏ గాడిదను అరెస్టుచెయ్యాలో తేల్చుకోలేనట్టుగా కానిస్టేబుల్స్ అంతా వక ర్నొకరు చూసకున్నారు. ఇన్స్‌పెక్టరుగారు ఎవర్ని వుద్దేశించి ఆమాట అన్నారో వాళ్ల ఎంతకీ తేల్చుకోలేక వూరకనే వుండిపోయారు.

అది చూసి ఇన్స్‌పెక్టరుగారు కోపంగా, "మిమ్మల్నే ఆ గాడిదను అరెస్టు చెయ్యమటుంన్నది" అని గాడిదకేసి చూపిస్తూ అరిచారు.

అప్పటిక్కాని తాము అరెస్టు చేయవలసింది ఎవర్నో అర్థం అయిందికాదు కానిస్టేబుల్స్‌కి అర్థం అయింతర్వాత పోస్టర్ మేయడం పూర్తిచేసి జనాన్ని తప్పు కొని వెళ్లడం సాధ్యంకాక నిలబడివున్న గాడిదను అరెస్టు చేశారు.

ఆ తరువాత యింకా ఎవర్ని అరెస్టుచెయ్యాలా అని యోచించారు ఇన్స్‌పెక్టర్ గారు అటుచూస్తే కాంగెసు, యిటుచూస్తే తెలుగుదేశం. కేంద్రంలో కాంగెసు, రాష్ట్రంలో తెలుగుదేశం. కనుక ఎవర్ని అరెస్టుచేసినా తన కొంపమునగడం ఖాయమని తలచి ఎవ్వర్నీ అరెస్టు చెయ్యకూడదని నిర్ణయించుకొని "సాయంత్రం మీరిద్దరూ స్టేషనుకొచ్చి స్టేట్మెంట్ యివ్వండి" అని చెప్పి వెనక్కి తిరిగివెళ్ళి వ్యాన్ ఎక్కారు.

ఇన్స్పెక్టర్ గారి చర్య కార్యకర్తలిద్దరికీ సబబుగానే తోచింది. అందుకని ఎవరి దారిని వారు వెళ్ళిపోయేరు.

ఇన్స్పెక్టరుగారు వ్యాన్‌లో పోలీసుస్టేషనుకు వెళ్లగానే కానిస్టేబుల్స్ వెనుక గాడిదను తోలుకొని తీసుకువెళ్ళి లాకప్‌లోవుంచారు.

ఇన్స్పెక్టరుగారు కుర్చీలో చేరబడి కాఫీకి ఆర్డరు యిచ్చి సిగరెట్ అంటించి పొగపీల్చి వదుల్తూ ఆ పొగను చూచి ఆనందిస్తూ కేసు ఎట్లా ఫైల్‌చెయ్యాలా అని ఆలోచించ సాగేరు - ఇంతలో ఫోను మోగింది. విసుగ్గా రిసీవరు అందుకొని, "హలో" అన్నారు. అవతలి వైపునుంచి ఆ వూరి మునిసిపల్ ఛేర్మన్‌గారి కంఠం వినిపించగానే నోట్లోంచి సిగరెట్ జారిపడింది. కంగారుగా, "నమస్కారం సార్" (చేతొత్తి) అన్నాడు.

అవతలి వయిపునుంచి తిరుగు నమస్కారం లేకుండానే ఛేర్మన్‌గారి కంఠం వినిపించింది "ఇంతకుముందు పార్టీల మధ్యన పోట్లాటను గూర్చి మీ యిన్వెస్టిగేషన్ ఎంత వరకు వచ్చింది?"

"ఏమైంది సార్: గాడిదను అరెస్టుచేసి తీసుకొచ్చాం. కేసుఫైల్‌చేసి కోర్టుకు పంపించడమే ఆలస్యం. రేపు పొద్దున్నే ఎలాగైనా గాడిదను కోర్టుకు పంపిస్తాను సార్" అని జవాబిచ్చేడు ఇన్స్పెక్టర్.

"కేసు ఎవరిమీద పెడతారు?"

"ఎవరిమీదేంటీ సార్: గాడిదమీదే"

"ఏ గాడిదని పెడతారు. ఐమీన్ కాంగ్రెసుగాడిదనా? తెలుగుదేశంగాడిదనా?"

"ఇంకా అదే తేలలేదు. గాడిదను ప్రశ్నించిం తర్వాత తేల్చిచెబుతాను సార్" అన్నాడు ఇన్స్పెక్టర్.

"సరే అదేదో త్వరగా తేల్చి నాకు చెప్పండి" అని ఫోన్ పెట్టేశారు ఛేర్మన్ గారు. ఫోన్ పెట్టేసి సెంట్రీని పిలిచి గాడిదను తీసుకువచ్చి తనముందు హాజరు పరచమని ఆర్డరు వేశారు ఇన్స్పెక్టర్‌గారు.

సెంట్రీ లాకప్‌లోంచి గాడిదను తీసుకువచ్చి హాజరు పరిచాడు.

ఇన్స్పెక్టరుగారు గాడిదకేసి కోపంగా చూస్తూ సెంట్రీని వెళ్లమన్నట్లుగా సంజ్ఞ చేశారు.

ఆకలితో వున్న గాడిద ముందుగా ఇన్‌స్పెక్టరుగారి ఫైళ్లను చూసి మేత దొరికిందని ఆనందిస్తూ ఆ తర్వాత ఇన్‌స్పెక్టరుగారి కేసి కొత్త యజమానిని చూసి నట్లు కృతజ్ఞతతో చూసింది.

యిదేమీ గమనించకుండానే ఇన్‌స్పెక్టరుగారు "నీ పేరు?" అనడిగేరు- తెల్లకాగితం తీసి ముందుంచుకొంటూ.

గాడిద అలాగే చూస్తూండిపోయింది.

ఇన్‌స్పెక్టరుగారు కోపంతో రెచ్చిపోయి, "నిన్నే అడుగుతోంది నీ పేరు?" అన్నారు.

గాడిద తల వంచుకొని ఫైళ్లకేసి చూస్తూండిపోయింది. ఇదిచూసి టాలరేట్ చెయ్యలేక ఇన్‌స్పెక్టరుగారు లాఠీతో గాడిదను రెండు తగిలించి "ఇప్పుడుచెప్పు" అన్నారు.

అప్పటికీ గాడిదేమీ చెప్పలేదు. కాబట్టి, తనే సమాధానం చెప్పుకొని 'గాడిద' అని రాసుకొన్నారు. తరువాత "ఏవూరు?" అని ప్రశ్నించేరు.

ఈసారికూడా సమాధానం చెప్పలేదు. ఇన్‌స్పెక్టరుగారు అంతకుముందు తనను ఎందుకు కొట్టారానని ఆలోచిస్తూండిపోయింది. ఇన్‌స్పెక్టరుగారికి తిరిగి కోపం రాగా ఆవేశంతో లేచి వెళ్ళి, "నేను అడిగిందానికి సమాధానం చెప్పవుటే.... ఎంత బలుపు నీకు" అంటూ చిక్కిపోయివున్న గాడిదను చితగా కొట్టేరు. గాడిద మవునంగా దెబ్బలన్నీ వోర్చుకుంది దాని దృష్టంతా టేబిల్‌మీదవున్న ఫైళ్లమీదే వుంది.

చివరకు చేతులు నొప్పిపుట్టగా విసిగిపోయి వచ్చి తలపట్టుకు కూచుని ఆ వూరి పేరే రాశారు. తరవాత ఆ గాడిద ఏగాడిదో తేల్చి కేసు వివరాలు రాయాలనుకున్నారు దొరికిన సాక్ష్యాలను బట్టిచూస్తే గాడిద తెలుగుదేశందేనని స్పష్టమవుతోందని పించింది. అది కాంగ్రెసు పార్టీ పోస్టర్ని తిన్నదానిబట్టి, కాంగ్రెస్ కార్యకర్త చెప్పిందాన్నిబట్టి చూస్తే యిది కచ్చితంగా తెలుగుదేశం గాడిదేనని తేల్చి చెప్పొచ్చనిపించింది. కాని

తెలుగుదేశం వాళ్లు దానికి వప్పుకోపడం లేదుకదా! కేసును గురించి ఆలోచిస్తూ వుండగానే ఫోన్ మోగింది, రిసీవరు అందుకొని విసుగ్గా 'హల్లో' అన్నారు.

'హలో' అంటూ అవతలివైపునుంచి తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడి కంఠం వినిపించింది. ఆ కంఠం వినడంతోనే ఇన్స్పెక్టరుగారు "నమస్కారమండీ" అన్నారు.

"ఇంతకుముందు జరిగిన కొట్లాటలో గాడిద ఏ పార్టీకి చెందిందని తేల్చేరు?" అడిగారు అధ్యక్షుడు.

"ప్రత్యక్ష సాక్ష్యాల్ని బట్టిచూస్తే అది తెలుగుదేశం గాడిదని స్పష్టమవుతోంది" అన్నారు ఇన్స్పెక్టర్.

"నాకు తెలిసినంతవరకు ఆ గాడిద మాదయితేకాదు. మీరు ఎలాగైనా సరే అది కాంగ్రెసు గాడిదని కేసు ఫైల్ చేయాలి" అన్నారు అధ్యక్షులవారు.

"చూస్తానండీ"

"చూస్తాను అనికాదు చెయ్యండి" అని వకక్షణం ఆగి తనువేదో గుర్తుతెచ్చుకున్నట్లు, "అన్నట్టు రేపునేను హైదరాబాదు వెళ్తున్నాను ఆ మధ్యన మీ ప్రమోషన్ గురించి చెప్పేరుకదా! ఆ సంగతేదోచూస్తానెండి" అని చెప్పి ఫోను పెట్టేశారు అధ్యక్షులవారు.

ఫోన్ పెట్టేసి ఆ గాడిదను కాంగ్రెసు గాడిదగా ఎలా చేయాలని ఆలోచిస్తూ కూచున్నారు ఇన్స్పెక్టర్' అంతసేపూ నిలువునా నిలబడిపోయివున్న గాడిదకు విసుగు పుట్టింది. కాళ్లు పీక్కుపోయి కడుపులో ఆకలి మండిపోతుండగా ఓపిక నశించి ఫైళ్ల మీదికెగబడి ఓ ఫైలందుకుని పరపరా నమిలి తినసాగింది.

ఇది చూడగానే ఇన్స్పెక్టరుగారికి వెర్రెత్తిపోయి కోపంతో గాడిదను చావచితక బాదారు. వళ్లంతా చీరుకుపోయి దానికి రక్తం కారసాగింది. ఇంకా కొడితే అది చస్తుందనే అనుమానంతో, పైగా యిది ఎమర్జెన్సీ కాదని జ్ఞాపకంరావడంవల్లా దాన్ని కొట్టడం మానేసి కానిస్టేబుల్ని పిలిచి దాన్ని తీసుకుపోయి లాకప్‌లో వేయమని ఆజ్ఞాపించారు.

తర్వాత ఇన్స్పెక్టరుగారికి యిది కాంగ్రెసు గాడిదేననడానికి వో బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. రాష్ట్ర ప్రభుత్వం తెలుగుదేశంది కాబట్టి అది అధికారపార్టీ

ఫైళ్లని తిన్నది కాబట్టి అది అపోజిషన్ పార్టీకి సంబంధించిందేనని కచ్చితంగా చెప్ప వచ్చనీ, అపోజిషన్ పార్టీ కాంగ్రెసు కాబట్టి అది కాంగ్రెసు గాడిదేనని నిరూపించ వచ్చనుకున్నారు. ఎందుకైనా మంచిదని యిరువర్గాలనుంచి సాక్షుల్ని పెట్టారు.

మర్నాడు ఉదయాన్నే గాడిదను కానిస్టేబుల్కిచ్చి కోర్టుకు పంపించేరు ఇన్స్పెక్టరుగారు.

కోర్టులో కేసు ఓడిపోతే పార్టీపడిపోయినట్లు భావించి కాంగ్రెస్, తెలుగుదేశం వర్గాలవాళ్లు పోటీపడి ప్రమాణాలు చేసి నిజంకాక అబద్ధపు సాక్ష్యాలు బలంగా చెప్పారు. సాక్ష్యాలన్నీ విన్న మేజిస్ట్రేటుగారు ఎటూ తేల్చుకోలేకపోయారు. గాడిద కాంగ్రెసుదా, తెలుగుదేశందా అని తీవ్ర మీమాంసలో పడ్డారు చివరకి గాడిదతోటే సాక్ష్యం చెప్పించి నిజం పలికించాలనుకున్నారు.

అందుకని ముందుగా గాడిదతో ప్రమాణం చేయించమని గుమాస్తాని పురమాయించారు.

గుమాస్తా భగవద్గీతని తీసుకువచ్చి గాడిదముందు నిలబడి "దేవుని ఎదుట" అన్నాడు.

భగవద్గీతని చూడగానే గాడిద కడుపులో ఆకలి భగ్గున బడబాగ్నిలా రగిలి పోయింది. వెంటనే అది భగవద్గీత నందుకొని నోటితో పరపర నమిలి తినసాగింది. ఇది చూసి ప్రేక్షకులు గొల్లున నవ్వసాగారు. మేజిస్ట్రేటుగారికి మతిపోయినంత పనైంది. 'సైలెన్స్ సైలెన్స్' అనరిచేరు.

ప్రేక్షకులంతా సైలెన్సయిపోయారు. గాడిద భగవద్గీత తినడం పూర్తిచేసి గుమస్తాకేసి, మేజిస్ట్రేటుకేసి కృతజ్ఞతతో చూసింది.

మేజిస్ట్రేటుగారు కొద్దిసేపు ఆలోచించి "గాడిద కాంగ్రెసుది కానీ, తెలుగు దేశంది కానీ కాదు మనకిపుడు కనిపించిన ప్రత్యక్ష సాక్ష్యాన్నిబట్టి యిది కమ్యూనిస్టు గాడిదని చెప్పవచ్చు. ఎందుకంటే కమ్యూనిస్టులకు దేవుడంటే నమ్మకంవుండదు. ఇప్పుడీ గాడిద భగవంతుడు కాకపోయినా మనం భగవంతుడిలా చూసుకొనే భగవద్గీ తను లక్ష్య పెట్టకుండా మనం చూస్తూ వుండగానే నమిలి తిన్నది. కాబట్టి యిది ఖచ్చితంగా కమ్యూనిస్టు గాడిదే" నని ఫైండింగ్ యిచ్చేరు.

సెప్టెంబర్ 8 - కా: గంగారాం సంస్మరణ:

# ఇప్పవనాల గాలిప్పుడు...

— అజ్ఞాత సూరీడు

అడవికీ ఆదివాసులకూ
ఆదివాసులకూ అసంతృప్తికీ
అసంతృప్తికీ ఆయుధ ధారణకూ
అనుసంధాన కర్తలైన మిత్రులారా!
మిమ్మల్ని గురించి రాయకుండా
అడవి గురించి ఏం రాయగలను?
అడవికి అందమూ మీరే
అడవితో మా అనుబంధమూ మీరే

గోండ్వానా నుంచి గోల్వారావరకు
ఎదిగిన అడవి గురించి
ఎవడికీ రాయక తప్పటం లేదిప్పుడు
ఇప్పవనాల మీది నుంచొచ్చే గాలి
ఇప్పుడు తుపాకీ మందు వాసనేస్తోంది!

సూర్జాగడ్ పర్వతాలకు 1857 ని *
మనంతప్ప మరెవ్వరు గుర్తు
చెయ్యగలరు?

శత్రు గాలింపుల నడుమ
సాయం సంధ్యలనూ
యేటి కెరటాల పాటనూ
మనకు మాత్రమే సాధ్యం
కనటం — వినటం!

గిరిజన వైర్‌లెస్‌లు ** మోగినక్షణాల్లో
జనం జమకావటం
ఖాకీ కుక్కలచేత
అక్కల కాళ్ళు మొక్కించటం
అసలు కథ ప్రారంభానికి
చిహ్నం సుమా!

జనప పుల్లల వెలుగులో
మీరు రాసిన కథలూ
వెగడు వెలుతురులో
మీరు రాసిన కవితలూ
ఉపరితలాన్ని కుదిపేస్తున్నాయ్!
గంగారాం చీలిన దవడల్లోంచి
వెలువడిన రుధిర సందేశం
సర్వత్రా ప్రేరణ ఈనాడు—
మరణించటం ద్వారా సైతం
గుణపాఠా న్నందించిన
సరిహద్దులు చెరిపిన చిన్నవాడు
గుండెల్లో కట్టుకునేవున్నాడు గూడు
అన్నట్టు మిత్రులారా!
బ్రమ్హగడ్ కొరివి చీమలబారు
ఎలావుందో మర్చిపోక రాయండీసారి!
గుట్టల బారుమీదుగా
చెట్ల సందులగుండా
విషజంతువుల సంచారం మధ్య
కసాయిమూకల గస్తీల నడుమ
బతుకుకోసం బతకటం
ఏమంత నాజూకైన విషయంకాదు.
అక్కడ ప్రతీదీ రేషనే అనుకుంటా
— జీవితకాలం కూడా!
మన విజయాలు
తృటిలో తొణికిసలాడి
కనుమరుగైనవే కావచ్చు
వాటి గురించి మన అనుభూతి
దీర్ఘకాలికం కావాలి!
విజయంమీద విశ్వాసంతో
బతగ్గలిగితే
అడవి జీవితం
అందమైందే మరి!

* ప్రస్తుత మహారాష్ట్రలో బందియ, కోట్రి నదుల మధ్య సూర్యఘడ్ కేంద్రంగా బాబూరావు నాయకత్వాన 1857—58 ల్లో జరిగిన తిరుగుబాటు

(రాడికల్ మార్చ్, జులై సౌజన్యంతో)

** తుడుం

సమీక్షా వ్యాసం :

# శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం

కె. బాలగోపాల్

'చైనాలో ఏం జరుగుతోంది?' అన్న ప్రశ్న తనప్రాముఖ్యతను చాలా వరకు కోల్పోయింది. చైనాలో ఏం జరుగుతోందో అందరికీ తెలుసు. కొతెల్‌హాం ఈ వ్యాసం రాసేనాటికి ఇంకా సందేహానికి అస్కారం వుండేదేమో. అప్పటికి చైనా కమ్యూనిస్టు పార్టీ సాంస్కృతిక విప్లవం ముగిసినట్టు ప్రకటించిందిగాని, దానిని తిరస్కరించలేదు. అప్పటికి డెంగ్‌ను మళ్ళీ తెరముందుకు తేవడం జరిగింది గాని, లీషావ్‌చీని విమర్శించడం ఇంకా మానలేదు. 'ఆధునికీకరణ' కోసం ఉత్పత్తి ఎక్కువ చేయమన్నారుగాని, అప్పటికింకా వర్గపోరాటాల కాలం ముగిసింది, ఇక ఉత్పత్తి చేయడమే తరువాయి. అని సిద్ధాంతీకరించలేదు. అప్పటికి 'డెంగ్‌పంథా'కు వ్యతిరేకంగా మావో అభిమానపాత్రుడిగవి తనకుతానే ప్రకటించుకున్న 'హువా పంథా' ఉన్నట్టు అనిపించింది. సాంస్కృతిక విప్లవంలో జరిగిన అరాచకాన్ని సంస్కరించి నిజమయిన మావో పంథాను హువాకువోఫెంగ్ నిలబెడతాడేమోనని ఆశించిన వాళ్లు లేకపోలేదు.

ఇప్పుడు అంతా తేటతెల్లమయింది. హువాలేదు, 'హువాపంథా' (అసలు అటువంటిది ఎప్పుడయినా వుండి వుంటే) లేదు. సాంస్కృతిక విప్లవాన్ని గొప్పవిఘాతంగా ప్రకటించారు. సోషలిస్టు సమాజంలో తీవ్రమయిన వర్గపోరాటాలకు స్థానం లేదని సిద్ధాంతీకరించారు. లీషావ్‌చీ విగ్రహాన్ని పునఃప్రతిష్ఠించారు. మావోనుగూడ మొదట 1966 దాకా (అంటే సాంస్కృతిక విప్లవం మొదలయ్యేదాకా) సరయిన మార్గంలో నాయకత్వం నిర్వహించాడని ప్రకటించి, క్రమంగా ఆ తేదీని 1956కు (అంటే సోషలిస్టు నిర్మాణానికి సంబంధించి మావో ఆలోచనా విధానం రూపొందక పూర్వం నాటికి) వెనక్కినెట్టారు. 1956 తరువాత మావో చేసిన సిద్ధాంతాలన్నీ తప్పులన్నారు. అతినూతనంగా, ఒకవైపు అమెరికానుండి అణురియాక్టర్లు కొనడానికి ఒప్పందం చేసుకుంటూ, మరొకవైపు ఆ సందర్భంలో చైనాకువచ్చిన రీగన్ సోవియట్ రష్యాను విమర్శిస్తూ మాట్లాడిన మాటలను సెన్సార్ చేసారు. మా దుకాణంలో

సరుకులు దించడానికి వచ్చినవాడివి పక్కదుకాణందారును తిడితే ఎలాగని డెంగ్ రీగన్‌ను కోప్పడ్డాడేమో. 'సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం' అనే మాటలను ప్రయోగించడం మానేసారు. సామ్రాజ్యవాదులతో శాంతియుత వ్యాపార సహజీవనం ప్రారంభమయింది. అయితే కృశ్చేవ్ 1956లో ఒక్క అమెరికా సామ్రాజ్యవాదంతో మాత్రమే శాంతియుతంగా కాపురం చేస్తానన్నాడు డెంగ్ ఇద్దరితోనూ చేయనున్నాడు.

మరయితే బెతెల్‌హాం రాసిన ఈ వ్యాసంగాని, దానికి రంగనాయకమ్మగారు చేసిన టీకా వ్యాఖ్యాన సహిత అనువాదంగాని, ఇవ్వాళ అనవసరమూ అంటేకాదు. ఎందుకంటే, 'ఆధునిక రివిజనిజం'ను మనం కుట్రగా దూషించి ఊరుకోకుండ అర్థం చేసుకునే ప్రయత్నం చేయాలి. దోపిడీ వర్గాలు విప్లవాన్ని కుట్ర అన్నట్టు మనం ప్రతీఘాతుక విప్లవాన్ని కుట్ర అంటున్నాం. అదీ కుట్రకాదు. ఇదీ కుట్ర కాదు. విప్లవానంతర సమాజంలో కొత్త బూర్జువా వర్గాలు పుట్టుకొస్తున్నాయనీ, ఆ వర్గాలు కార్మికవర్గం చేతికి అధికారం అందనివ్వకుండ తామే చేజిక్కించుకునే ప్రయత్నం తీవ్రంగా చేస్తున్నాయనీ, ఇప్పుడిప్పుడే స్పష్టమవుతోంది. ఇది అనివార్య పరిణామం కాకపోవచ్చుగాని, యాదృచ్ఛికం గూడకాదు. సోషలిస్టు సమాజ నిర్మాణ పోరాటంలోంచి పుట్టుకొస్తున్న సహేతుకమయిన వాస్తవం. ఇది కుట్రకాదు. వర్గ పోరాటమే, ఈ వర్గపోరాటం (ప్రతీఘాతుక విప్లవ పోరాటం) లోటుపాతుల్ని అర్థం చేసుకోవడానికి బెతెల్‌హాం వ్యాసం ఒకతొలి ప్రయత్నంగా ఉపయోగపడుతుంది. ఆ వ్యాసాన్ని రంగనాయకమ్మగారూ ఆమె మిత్రులూ చాలా సరళంగా అనువదించి విపరమయిన వ్యాఖ్యలతో తెలుగుపాఠకుడికి అందించారు.

అయితే ఈ పుస్తకాన్ని సమీక్షించడంలో కొన్ని ఇబ్బందులున్నాయి. ఇందులో బెతెల్‌హాం రచనకంటే రంగనాయకమ్మగారి రచనే ఎక్కువ ఉంది. బెతెల్‌హాం వ్యాసం (రంగనాయకమ్మగారి ఫుట్‌నోట్లతో సహా) 154 పేజీలయితే, 43 పేజీల ముందు మాట, 110 పేజీల పెద్దఫుట్‌నోట్లు కలిపి సరిగ్గా అంతవుంది. మరొక 24 పేజీల చివరిమాటవుంది. వీటిలో రంగనాయకమ్మగారు బెతెల్‌హాం లేవదీసిన ప్రశ్నలనేగాక చాల విషయాలను చర్చించారు, కొన్ని మాటలకూ ప్రయోగాలకూ అర్థంచెప్పారు. తెలుగుపాఠకుడికి అంత సులభంగా దొరకని కొంత సమాచారం అందజేసారు (ఉదాహరణకు లిన్‌పియావో ఉదంతం, అట్లాగే 'చివరిమాట'లో, బెతెల్‌హాం ఈ వ్యాసం రాసిన కాలంనుండీ ఇప్పటిదాకా చైనా కమ్యూనిస్టు పార్టీ

తీసుకున్న తిరోగామి చర్యల పట్టిక). లేవదీసిన ప్రతీ ప్రశ్నకూ విస్పష్టంగా సమాధానం ఇచ్చారు. ఈ చర్చనంతటినీ ఎంతమేరకు ఈ సమీక్షపరిధిలోకి తీసుకు రావడం సాధ్యమో అనుమానమే. ఎందుకంటే రంగనాయకమ్మగారి విశ్లేషణా పద్ధతితో నాకు మౌలికమయిన విభేదం ఉంది. ఆమె హేతువాదులతో పోట్లాడతారుగాని ఆమె విశ్లేషించే పద్ధతి హేతువాదులదే. ఒక విషయాన్ని అర్థంచేసుకోవాలంటే దాన్ని పదునయిన తర్కంతో నిర్దయగా తరుక్కుంటూపోవడమే మార్గమని హేతువాదులు నమ్ముతారు. గతితార్కిక భౌతికవాద జ్ఞానసిద్ధాంతానికి ఇది చాలా దూరం. ముఖ్యంగా మావో ఆలోచనా విధానానికి హేతువాదం పూర్తిగా వ్యతిరేకం. ఈ విషయం అర్థంచేసుకోవాలంటే ఈ పుస్తకంలోని పేజీలు 271–272 చూడండి. అక్కడ, మావో 1966లో చియాంగ్ చింగ్‌కు రాసిన ఒక ఉత్తరం వుంది. ఆ ఉత్తరాన్ని, అందులోని 'అవకతవకలు', 'మార్మికత', రంగనాయకమ్మగారిలో కలిగించే విస్పృహనూ చూస్తే పైన చెప్పిన విషయం అర్థం అవుతుంది.

### సాంస్కృతిక విప్లవం

సోషలిస్టు విప్లవం రాజ్యాధికారంలోనూ ఆర్థిక సంబంధాలలోనూ విప్లవాత్మకమయిన మార్పులుతెస్తుందని, వాటికి అనుగుణంగా ఇతర (సాంస్కృతిక) రంగాలలో విప్లవాత్మకమయిన మార్పులను సాధించాల్సి వుంటుందని, అందుకోసం పోరాటం చేయకతప్పదని, లెనిన్ కాలంనుండీ కమ్యూనిస్టులు అభిప్రాయపడ్డారు. ఆ పోరాటానికి 'సాంస్కృతిక విప్లవం' అన్నపేరుగూడ ప్రయోగించారు. చైనాలో సాంస్కృతిక విప్లవాన్ని కమ్యూనిస్టుపార్టీ ప్రారంభించినప్పుడు ఈ అభిప్రాయాన్నే ప్రకటించింది. 1966లో సాంస్కృతిక విప్లవాన్ని ఆవిష్కరిస్తూ పార్టీ కేంద్ర కమిటీ తీర్మానించిన 16 అంశాలలో మొదటిది ఈ విధంగా వుంది. 'విద్య, సంస్కృతి, కళలు, ఉపరితలానికి చెందిన అన్ని ఇతర భాగాలలో ఏవయితే సోషలిస్టు ఆర్థిక పునాదికి తగిన విధంగా లేవో వాటిని మార్చాలి, ఉపరితలాన్ని పునాదికి అనుగుణంగా మార్చే సాంస్కృతిక పోరాటమే సాంస్కృతిక విప్లవం అనే అవగాహన ఇది. అయితే, రంగనాయకమ్మగారు గుర్తించినట్లు ( ముందుమాట, పేజీ 37 ) 'సాంస్కృతిక విప్లవంలో ఉపరితలాన్ని మార్చడానికి చేసిన ప్రయత్నాలు పునాది దాకా దారితీసాయి'. ఈ విషయాన్ని చైనాకమ్యూనిస్టుపార్టీ ఊహించకపోవడం, ఉపరితలాన్ని ప్రక్షాళనం చేయడం మాత్రమేకాదు, పునాదినే సోషలిస్టుగా మార్చాల్సి

వుందని గుర్తించకపోవడం, వాళ్ల 'సిద్ధాంత అవగాహనలో పొరబాటు'గా రంగనాయకమ్మగారు అభిప్రాయపడ్డారు. శుద్ధతర్కాన్ని వదిలిపెట్టి చారిత్రికంగా చూస్తే ఇది వేరే విధంగా కనిపిస్తుంది. చైనాకమ్యూనిస్టుపార్టీ అవలంబించిన ప్రజాపంథాకు ముందునుండిగూడ ఒక గతితార్కిక లక్షణంవుంది. పార్టీ ఎప్పుడూగూడ ప్రజలకు చాలా కనీస అవగాహనను, కనీస కార్యక్రమాన్ని, ఇచ్చింది. దాన్ని ప్రజలు అందుకొని ఆ అవగాహననూ కార్యక్రమాన్నీ దాటి ముందుకుపోతే, అప్పుడు కేంద్ర కమిటీ సమావేశమై ప్రజలమీద అవిశ్వాసతీర్మానం జారీచేయకుండ, తమ కార్యక్రమాన్నే అభివృద్ధిచేసుకునేవారు. చైనాలో భూసంస్కరణల అమలుమొత్తం (ప్రాథమిక సమిష్టీకరణనుండి కమ్యూన్లవరకు) ఈ విధంగానేసాగింది 'ఛా-చాయి నుండి నేర్చుకోండి' మొదలయిన ఆదేశాలు ఈ క్రమానికి చెందినవే. ప్రజల సంసిద్ధతతో సంబంధంలేకుండ పార్టీ తన అవగాహనా పరిపక్వతను ప్రదర్శించుకోవడం ప్రజాపంథా అనిపించుకోదు. From the masses, To the masses అన్నప్పుడు ప్రజలకు ఇచ్చే అవగాహన, ప్రజాముఖంగా జరిపే చర్చలు, ప్రజల సంసిద్ధతమీద ఆధారపడక తప్పదు. అయితే ప్రజలసంసిద్ధత పేరుచెప్పి ఎప్పటికీ వెనకబడి ఉండిపోకుండ, ప్రజలకు తమ సంసిద్ధతను అభివృద్ధి చేసుకునే అవకాశాన్నీ ప్రోత్సాహాన్నీ ఇవ్వాలి, ఆ అభివృద్ధిని ఆధారం చేసుకుని పార్టీ తన కార్యక్రమాన్ని పరిపుష్టం చేసుకోవాలి. ఈ విషయంలో చైనాకమ్యూనిస్టుపార్టీని తప్పు పట్టడం కష్టం. ఇది నేను కేవలం చైనాపార్టీనీ మావోనూ 'కాపాడడం' కోసం అంటున్నది కాదు. సాంస్కృతిక విప్లవానికి కనీసం ఆరేడు సంవత్సరాలు పూర్వం (1959 - 60 కాలంలో) మావో చేసిన ఒక రచనలో ('క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్' అనే పేరుతో ఇది ప్రచురించబడింది) సాంస్కృతిక విప్లవం లేవదీసిన ఎన్నో ప్రశ్నలను స్పష్టంగా గుర్తించాడు. పునాది ఆర్థిక సంబంధాలు ఇంకా ఎంతగానో మారితే తప్ప అవిసోషలిస్టు సంబంధాలుకావని గుర్తించాడు. మారవలసిన మార్గాన్ని సూచిస్తూ, సాంస్కృతిక విప్లవంలో ముందుకొచ్చిన 'కార్మిక మేనేజ్‌మెంట్', 'త్రీ-ఇన్-వన్-బృందాలు' వగైరా విషయాలను ఆనాడే చెప్పాడు ('క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్', పేజీ 68 చూడండి). ఆ రచన పార్టీలో చర్చకై ఉద్దేశించబడింది కాబట్టి ఈ అవగాహన ఒక్క మావోకే పరిమితమయి ఉండేదని అనుకోవడానికి వీలులేదు. 'షాంగై రాడికల్స్' అనీ 'గ్యాంగ్ ఆఫ్ ఫోర్' అనీ పిలవబడ్డవాళ్లకూ, ఇంకా ఎంతో మందికీ ఉండే ఉండాలి. సాంస్కృతిక విప్ల

వాన్ని వ్యతిరేకించిన వాళ్లకు గూడ అర్థం అయ్యేఉండాలి, లేకపోతే వాళ్లు దాన్ని అంతబలంగా వ్యతిరేకించేవారు కాదు.

సాంస్కృతిక విప్లవకాలంలో చైనాలో నిజంగా ఏం జరిగిందో మనకు ఇప్పటి దాకా తెలియదు. ఆ విప్లవదశలో సొంతం పాల్గొన్న వాళ్లెవరయినా పాక్షికంగా కాకుండ సమగ్రంగా ఆనాటి చరిత్రను చెప్పేదాకా తెలిసే అవకాశం లేదు. అయితే బెతెల్‌హేం అన్నట్టు సాంస్కృతిక విప్లవం ఎన్నో కొత్త ప్రశ్నల్ని లేవదీసింది. ఉబుసుపోకకు కాకుండ ఆచరణాత్మకంగా లేవదీసింది. ఈ ప్రశ్నలకు సమాధానంగా కొన్ని కొత్త విప్లవ సంప్రదాయాలను చూపింది. వాస్తవంలో అవి ఎంతత్వరలో ఎంత వక్రరూపంతీసుకున్నప్పటికీ వాటి ఆవిష్కరణ మాత్రం అబద్ధం కాదు. ఆ కాలంలో చైనాలో పర్యటించిన పాశ్చాత్యులు చాలామంది సాంస్కృతిక విప్లవంమీద పుస్తకాలు రాసారు. వాళ్లలో ఎడ్గర్ స్నో వంటి ఉదారవాదులనుండీ బెతెల్‌హేం వంటి మార్క్సిస్టుల దాకా చాలా రకాలు ఉన్నారు. అందరూగూడ మనకు ఎంతో ఉత్తేజకరమయిన చిత్రాన్ని ఇచ్చారు. ఆ చిత్రం ఎంతవరకు వాస్తవమో, ఎంతవరకు ఆ నూతన సంప్రదాయాల మైకంలో తమ ఆశలకూ ఆశయాలకూ ఆయారచయితలు ఇచ్చుకున్న కాల్పనిక వ్యక్తీకరణో, మనకుతెలీదు. ఎందుకంటే సాంస్కృతిక విప్లవాన్ని వ్యతిరేకించే వాళ్లు అంతకు సమంగా వికారమయిన చిత్రాన్ని ఇస్తున్నారు కాబట్టి. అయితే ఆ చిత్రం ఇచ్చిన ఉత్తేజం నిష్ప్రయోజనం కానట్టే, అదిలేవదీసిన ప్రశ్నలనూ ఆవిష్కరించిన సంప్రదాయాలనూ చర్చించడం గూడ నిష్ప్రయోజనం కాదు. సాంస్కృతిక విప్లవం ఎందులో విఫలమయినా ఒక్క విషయంలో మాత్రం విజయాన్ని సాధించింది. సోషలిస్టుదేశాలు చేసేది ఉత్పత్తిలో పెట్టుబడిదారీ దేశాలతో పోటీ పడడం మాత్రమేనా అని ప్రశ్నిస్తున్న వాళ్లకు ఒక కొత్తబాటను చూపింది. భవిష్యత్తుమీద ఒక కొత్త వెలుగును ప్రసరింపజేసింది.

ఆ ప్రశ్నలేమిటో చూద్దాం.

1. 'సోషలిస్టు విప్లవం' అనేది ఉపరితలాన్నేకాదు, పునాది ఆర్థిక సంబంధాలను గూడ ఒక్కసారిగా మార్చదు. పునాది ఆర్థిక సంబంధాలలో మూడు అంశాలు ఉంటాయని మావో తన 'క్రిటిక్ ఆఫ్ సోవియట్ ఎకనామిక్స్'లో అంటాడు (ఇక మీదట ఈ పుస్తకాన్ని 'క్రిటిక్' అంటాను) ఒకటి ఆస్తిసంబంధం, అంటే ఉత్పత్తి సాధనాల యాజమాన్య సంబంధం. దీన్ని సోషలిస్టు విప్లవం త్వరలో కాక

పోయినా ఒక క్రమంలో పరిష్కరిస్తుంది. భారీపరిశ్రమల్ని వెంటనే ప్రభుత్వపరం చేసి, భూమిని గూడ గ్రామస్థాయిలో సమిష్టి ఆస్తిగా మారుస్తుంది. క్రమంగా గ్రామస్థాయినుండి కమ్యూన్‌స్థాయిదాకా సమిష్టీకరణను పెంచుతుంది. అది కమ్యూన్ స్థాయినుండి మొత్తం జాతి యొక్క సమిష్టి ఆస్తి అయిననాడే భూమి అనే ఆస్తి సంబంధం సోషలిస్టు సంబంధం అవుతుందని మావో పదేపదే అంటాడు.

అయితే ఆస్తిసంబంధం ఆర్థిక సంబంధాలలో ఒక అంశం మాత్రమే. రెండవది, ఒక ఫ్యాక్టరీలో, లేక ఒక ఉత్పత్తి యూనిట్‌లో, పనిచేసే వాళ్లందరి మధ్యవుండే సంబంధాలు. ఒకఫ్యాక్టరీలో కార్మికులు, మేనేజర్లు సాంకేతికనిపుణులు, గుమాస్తాలు, సైంటిస్టులు ఉంటారు. కార్మికులలోనే ఎన్నో రకాల ఉంటారు. నిపుణులయినవాళ్లు ఉంటారు. వీళ్లందరి మధ్యవున్న సంబంధాలు ఏమిటి? ఆ సంబంధాలు ఎట్లావుంటే అవిసోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు అవుతాయి? సాంస్కృతిక విప్లవానికి పూర్వం చైనా ఈ విషయంలో సోవియట్ నమూనాను అనుసరించింది. ఈ నమూనాలో సోషలిస్టు ఫ్యాక్టరీకి బూర్జువా ఫ్యాక్టరీకి పెద్దగాతేడావుండదు. ఫ్యాక్టరీలోని వివిధసెక్షన్ల మధ్య అవే సంబంధాలు ఉంటాయి. కార్మికులు చేయమన్న పని, చేయమన్నప్పుడు, చేస్తారు. సూపర్‌వైజర్లు కార్మికులు పనిదొంగలు కాకుండ పర్యవేక్షణ చేస్తారు. సాంకేతికసిబ్బంది (టెక్నీషియన్లు, సైంటిస్టులు) సాంకేతిక విషయాలు చూసుకుంటారు. మేనేజర్లు మొత్తం ఫ్యాక్టరీని నడుపుతారు. ఈ సిబ్బంది మధ్య బూర్జువా ఫ్యాక్టరీలో వుండే పని విభజన (division of labour), అధికార అంతస్తులు (power hierarchy) అట్లాగే కొనసాగుతాయి. వేతనాల అంతస్తులు మాత్రం కొద్దిమేరకు తగ్గుతాయి. అయితే ఒక్క తేడావుంటుంది. బూర్జువా ఫ్యాక్టరీలో మేనేజ్‌మెంట్‌కు స్వయంప్రతిపత్తి ఉంటుంది. సోవియట్ నమూనాలో మేనేజ్‌మెంట్‌కు చాలా పరిమితమయిన అధికారం ఉంటుంది. అసలు నిర్ణయాలు చాలా వరకు పై స్థాయిలో జరుగుతాయి. వాటిని సమర్థవంతంగా అమలుచేయడం మాత్రమే మేనేజ్‌మెంట్ బాధ్యత. ఈ విషయంలో గూడ మేనేజ్‌మెంటును పర్యవేక్షించేందుకు ఫ్యాక్టరీలో ఒక పార్టీకమిటీగాని, పార్టీబాధ్యులుగాని వుంటారు. ఈ కమిటీని పార్టీయే నియమిస్తుంది తప్ప ఫ్యాక్టరీలోని కార్మికులు ఎన్నుకోరు. (ఇది స్టాలిన్ కాలంనాటి సోవియటు నమూనా. ప్రస్తుతం సోవియటు రష్యాలో ఈ ఒక్క తేడాను గూడ తొలగించి ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటుకు స్వయంప్రతిపత్తి ఇచ్చే క్రమంకొనసాగుతోంది. ఈ బూర్జువాయీకరణను ప్రజాస్వామికీకరణ అని ప్రశంసిస్తున్నారు గూడ!)

సాంస్కృతిక విప్లవం ఈ రకమయిన సంబంధాలు బూర్జువా సంబంధాలే తప్ప సోషలిస్టు సంబంధాలు కావని ప్రకటించింది. అంటే ఉపరితలాన్ని విప్లవీకరించడానికి బయలుదేరిన విప్లవం పునాదిలోనే ఇంకా విప్లవం రావలసివుందని గుర్తించింది. కొన్ని కొత్త సంప్రదాయాలను సృష్టించింది. పార్టీచేత నియమించబడే పార్టీ కమిటీలను తొలగించి కార్మికులచేత ఎన్నుకోబడే విప్లవకమిటీలను ఏర్పాటు చేసింది. మేనేజర్లయిన వాళ్ల వారంలో ఒకటి రెండురోజులు సాధారణ కార్మికులలాగ యంత్రాలతో పనిచేయాలని, సాధారణ కార్మికులుగూడ మేనేజ్‌మెంట్ బాధ్యతలు చేపట్టాలని నియమం పెట్టింది. అంటే 'కార్మిక మేనేజుమెంటు'ను ప్రవేశపెట్టింది. ఫ్యాక్టరీయొక్క అభివృద్ధికి సంబంధించిన విషయాలు నిర్ణయించడానికి త్రీ-ఇన్-వన్ కమిటీలు ఏర్పడ్డాయి. ఇందులో కార్మికులు, సాంకేతిక నిపుణులు, పార్టీకేడరు, ఉంటారు. అంటే శ్రామిక అనుభవం, సాంకేతికపరిజ్ఞానం, రాజకీయపంథా, మూడూకలిసి ఉమ్మడిగా ఫ్యాక్టరీని నడుపుతాయి. (ఇక్కడ ఫ్యాక్టరీ అన్నది అన్ని రకాల ఉత్పత్తి యూనిట్లకూ వర్తిస్తుంది. వ్యవసాయక్షేత్రాలు, పశుపోషక కేంద్రాలు వగైరా) అంతేకాక, పార్టీకేడరుగూడ వారానికి కొన్నిరోజులు శ్రామికులతో బాటు శారీరక శ్రమచేయాలి. ఇదంతాగూడ ఉత్పత్తి సంబంధాలలో గణనీయమయిన విప్లవం అని వేరే చెప్పనవసరంలేదు. దీనికి బెతెల్‌హాం అత్యంత ప్రాధాన్యత ఇచ్చినట్టు కనిపిస్తుంది రంగనాయకమ్మగారుగూడ అన్ని విషయాలకంటె 'కార్మికమేనేజుమెంటు'కే ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చారు.

ఈ కొత్త సంబంధాలు ఎంతకాలం ఎన్నిప్రాంతాలలో అమలు చేసారోతెలీదు. కొన్ని చోట్ల మళ్లీ తిరిగి వెనక్కిపోయారు. కొన్నిచోట్ల అసలు నిపుణులుగాని మేనేజుమెంటుగాని పార్టీనాయకత్వంగాని అవసరమేలేదనే అతివాదానికి పోయారు 1976లో ప్రతీఘాతుక విప్లవం విజయవంతమయిన తరువాత ఈ ప్రయోగాన్నే అతివాదంగా ప్రకటించి మళ్లీ పాతనమూనాను చేపట్టారు. అయితే నిత్యజీవిత ఆచరణలో భాగమయిపోయిన ఏ సంప్రదాయమూ కేవలం ప్రకటనలతో నాశనంకాదు. కాబట్టి, ఈ కొత్తసంబంధాలు పూర్తిగా రూపుమాసిపోయాయని నమ్మడానికి వీలులేదు. (ముఖ్యంగా వ్యవసాయ కమ్యూన్లలో).

ఉత్పత్తి సంబంధాలలో మావో చెప్పిన మూడవ అంశం పంపిణీ విధానం (distribution). సమాజం ఉత్పత్తిచేసే వివిధ పదార్థాలను ప్రజలందరికీ ఏప్రాతి

పదికమీద పంపకంచేయాలో నిర్ణయించే విధానం ఇది. అసలు ఏయే పదార్థాలు ఉత్పత్తి అవుతాయో గూడ పంపిణీ విధానమే కొంతమేరకు నిర్ణయిస్తుంది. నిజానికి పంపిణీ విధానం సామాజిక సంబంధాలలో చాలా కీలకమయినది. గ్రామాలకూ పట్టణాలకూ మధ్య అసమానత, బుద్ధిజీవులకూ శ్రామికులకూ మధ్య అసమానత, స్త్రీలకూ పురుషులకూ మధ్య అసమానత, అన్నీగూడ పంపిణీ విధానంతో సన్నిహితంగా ముడిపడివుండే సామాజిక సంబంధాలు- ఈపంపిణీ విధానాన్ని నిర్ణయించే విషయాలు చాలావుంటాయి. వేతన విధానం వాటిలో ముఖ్యమయినది. ఒకప్పుడు వేతనవిధానం పెట్టుబడిదారీదేశాలలోలాగే ఉండేదని మావో చెప్పినట్టు బెతెల్‌హాం అంటాడు. పైగా, పనికాలాన్నిబట్టి వేతనం (time-rate) ఇచ్చే పద్ధతి గూడ ఉండేది. దీనివల్ల కార్మికులు సమిష్టిగా కాక ఒకరితో ఒకరు పోటీపడి ఎంత ఎక్కువ ఉత్పత్తిచేస్తే అంత ఆదాయం లభిస్తుందనే స్వార్థంతో పనిచేస్తారు. ఇది కుటుంబసంబంధాలమీద గూడ ప్రభావంవేస్తుంది. కార్మికులు ఎక్కువ ఉత్పత్తి చేయడంకోసం తమ భార్యాపిల్లలచేత గూడ విపరీతంగా శ్రమచేయిస్తారు (మనదేశంలో కాంట్రాక్ట్‌లేబర్ ఉన్న చోట- తునికాకునుండీ రాళ్లుకొట్టేపనిదాకా- ఈ విషయం కనిపిస్తుంది). సాంస్కృతిక విప్లవంలో దీన్ని పూర్తిగా రద్దుచేసారు. వేతనం గ్రేడ్లుగూడ తగ్గించారు. అయినప్పటికీ 1975 నాటికి 8గ్రేడ్ల (అంతస్తుల) వేతన విధానం ఉండిందని బెతెల్‌హాం అంటాడు. అయినా, చైనాలో వున్నంత సమానత ఏ దేశంలోనూ లేదని బూర్జువా పరిశీలకులు సహితం ఒప్పుకుంటున్నారు. ప్రస్తుతం ఈ సమానతలో వెనకడుగు వేసేప్రయత్నాలు జరుగుతున్నాయి. నిపుణులకువేతనాలూ సౌకర్యాలూ పెంచారు. పని ఎక్కువచేస్తే కూలిఎక్కువ ఇచ్చే ఆర్థిక ప్రోత్సాహకాలను (material incentives) ప్రయోగిస్తున్నారు. దీన్ని సోవియటు రష్యాలో ఎన్నడో సిద్ధాంతీకరించారు. ఆర్థిక ప్రోత్సాహకాలవల్ల కార్మికుడు ఎక్కువడబ్బు సంపాదించాలనే స్వార్థంతో, సోషలిస్టు వ్యవస్థను పటిష్ఠంచేసేందుకు కావలసిన ఎక్కువ ఉత్పత్తిని సమకూరుస్తాడనీ, ఈ విధంగా సోషలిస్టు వ్యవస్థ అవసరాలకూ, కార్మికుడి స్వార్థానికీ సమన్వయం కుదురుతుందనీ, వాళ్లు తీర్మానించారు. దీన్ని గురించి మావో తన 'క్రిటిక్',లో 'ఇలాగయితే పెట్టుబడిదారీ విధానాన్ని మించిందిలేదు' అని వేళాకోళంగా అంటాడు. మరి ఆర్థిక రంగాన్ని పటిష్ఠం చేసేందుకు కావలసిన ప్రోత్సాహం ఎక్కడినుంచి రావాలంటే రాజకీయ చైతన్యంనుండి, అంటాడు. కార్మికుడు సోషలిస్టు వ్యవస్థను 'తన సమాజం'గా అనుకొని పటిష్ఠం చేయాలేగాని డబ్బు ఆశతో కాదు. ఆర్థికరంగంలో

Politics in Command అంటే అర్థం ఇదే. సాంస్కృతిక విప్లవంలో దీన్ని అమలుచేసే ప్రయత్నంచేసారు. కొన్నిచోట్ల అన్నిరకాల ఆర్థికప్రోత్సాహకాలనూ రద్దుచేసారు. అయితే ఇప్పటి ప్రభుత్వం సోవియట్ నమూనాలో ఆర్థికప్రోత్సాహకాల స్వార్థం ప్రాతిపదికగా చైనాయొక్క 'నాలుగు విధాల ఆధునీకీకరణ'ను సాధించాలని చూస్తోంది.

సాంస్కృతిక విప్లవం ముట్టుకోని ముఖ్యమయిన ఆర్థికసంబంధాలు రెండున్నాయి. ఒకటి సరుకుల ఉత్పత్తి (Commodity Production), రెండవది పునరుత్పత్తి క్రమం (Process of Reproduction). ఇవి రెండూగూడ ఒకంతట పరిష్కారమయ్యే సమస్యలుకావు కాబట్టి వీటిని సాంస్కృతిక విప్లవం పట్టించుకోక పోవడంలో వింతలేదు. సాంస్కృతిక విప్లవం సిద్ధాంత చర్చకాదు, ఆచరణాత్మకమయిన పోరాటం. సామాజిక ఆచరణలో మానవుడు తనకు అప్పటికి సాధ్యమయ్యే కర్తవ్యాలను మాత్రమే ఎంచుకుంటాడు. (Mankind always sets itself only such tasks as it achieve అని మార్క్స్ అన్నాడు). కాని, ఆధునిక రివిజనిజం అంటే ఏమిటో, సోషలిస్టు సంబంధాలు ఏవిధంగా ఉండాలో, ఆధునిక రివిజనిజం యొక్క వర్గపునాది ఏమిటో, ఇత్యాది విషయాలను సిద్ధాంత చర్చచేసే బెతెల్‌హాం గూడ వీటిని పట్టించుకోక పోవడం ఆశ్చర్యమే.

మొదట సరుకుల ఉత్పత్తిని తీసుకుందాం. ఉత్పత్తి అయ్యే పదార్థాలు 'మారకపు విలువలుగా' ఉత్పత్తికావడం, అంటే మార్కెట్‌లో అమ్మకంకోసం ఉత్పత్తికావడం, సరుకుల ఉత్పత్తి. ఇది బూర్జువా సమాజపు ప్రధానలక్షణాలలో ఒకటి. ఈ సరుకుల ఉత్పత్తి పోవాలంటే, మొత్తం సమాజం యొక్క వివిధ అవసరాలను కనుక్కొని (నిర్ణయించి), వాటిని తీర్చడానికి అవసరమయిన ఉత్పత్తిని చేయించి, అవసరాలకు అనుగుణంగా నిర్ణయించిన పంపిణీ విధానాన్ని అనుసరించి దాన్ని పంపకం చేసే విధానాన్ని రూపొందించి సమగ్రంగా అమలుచేయాలి. ఇది ఒక్కరోజులోగాని 30 సంవత్సరాలలోగాని అయ్యేపనికాదు. మరి సరుకుల ఉత్పత్తి ఉన్నంతకాలం బూర్జువా చైతన్యంగాని, బూర్జువా తరహా ఆర్థిక సంక్షోభాలుగాని పూర్తిగా మాసిపోవు. భూసారం, వనరులు, సాంకేతిక సంస్కృతి, మొదలయిన విషయాలలో కొంత అభివృద్ధి చెందినప్రాంతాలు ఈ విషయాలలో వెనుకబడ్డ ప్రాంతాలకంటే ఎక్కువ ఉత్పత్తి, ఎక్కువ (తలసరి) ఆదాయం, కలిగివుండక

